# కేయూరబాహుచరిత్రము

మంచనకవి ప్రణీతము








పరిష్కర్త:
[illegible]జ్ఝల కోదండరామయ్య, యం. ఏ.

# కవిరాజశిఖామణి

## అభిప్రాయములు

"కవిరాజశిఖామణి కవితావిమర్శయైనప్పటికిని చక్కనినవలవలె చదువనుల్లాసము గొల్పుచున్నది."

—దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి.

"కవిరాజశిఖామణి ఆమూలాగ్రముగా చదివితిని. కృత్యవతరణిక, సంవాదిరచనలు–ఈ శీర్షికలతో నున్న అధ్యాయముల గ్రంథము మీ భాషా పాండిత్యమునకు, ధారణకు నిదర్శనములు."

–డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రి.

"ఇంతవఱకు నన్నిచోడుని గురించి వ్రాయబడిన వ్యాసాల్లో గ్రంథాల్లో లేని విశేషాంశాలు మీ గ్రంథంలో ఎన్నదగినవి చాలా ఉన్నాయి."

—జి. నారాయణస్వామి రెడ్డి.

"...తెలుగు విమర్శసాహిత్యమున ఇది కొంచెము క్రొత్తపద్ధతియే...బహువిధ మైనశ్రమ యీరచనలో కాన్పించును. కవిరాజశిఖామణి గ్రంథము జదువువారికీ పాత్రము కైపాత్రము (Hand Book)గా నుండదగినది."

—భారతి.

"...ఆయా విభాగాలకింద నన్నెచోడుని కుమారసంభవంలోని మేలిమిని వెలయించుటకై గొప్ప ప్రయత్నం జరిగింది...........సారస్వతప్రియులు చదవవలసిన పుస్తకం."

—ఆంధ్రజ్యోతి.

"...ముఖ్యముగా సారస్వతప్రియులు చదివి యానందింపదగిన గ్రంథరాజము ఈ కవిరాజశిఖామణి."

—ఆలిండియా రేడియో–విజయవాడ.

శార్వరి
మాఘపూర్ణిమ
1960



వెల :
ఒక రూపాయి
డెబ్బదియైదు నయాపైసలు

ఫ్రీడమ్ ప్రెస్సు,
మదరాసు-21.

# కవిరాజశిఖామణి

## అభిప్రాయములు

"కవిరాజశిఖామణి కవితావిమర్శ యైనప్పటికిని చక్కనినవలవలె చదువ నుల్లాసము గొల్పుచున్నది."

—దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి.

"కవిరాజశిఖామణి ఆమూలాగ్రముగా చదివితిని. కృత్యవతరణిక, సంవాదిరచనలు-ఈ శీర్షికలతో నున్న అధ్యాయముల గ్రంథము మీ భాషా పాండిత్యమునకు, ధారణకు నిదర్శనములు."

-డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రి.

"ఇంతవఱకు నన్నిచోడుని గురించి వ్రాయబడిన వ్యాసాల్లో గ్రంథాల్లో లేని విశేషాంశాలు మీ గ్రంథంలో ఎన్నదగినవి చాలా ఉన్నాయి."

—జి. నారాయణస్వామి రెడ్డి.

"...తెలుగు విమర్శసాహిత్యమున ఇది కొంచెము క్రొత్తపద్ధతియే...బహువిధ మైనశ్రమ యీ రచనలో కాన్పించును. కవిరాజశిఖామణి గ్రంథము జదువువారికి పాత్రము కైపాత్రము (Hand Book) గా నుండదగినది."

—భారతి.

"...ఆయా విభాగాలకింద నన్నెచోడుని కుమారసంభవంలోని మేలిమిని వెలయించుటకై గొప్ప ప్రయత్నం జరిగింది..........సారస్వతప్రియులు చదవవలసిన పుస్తకం."

—ఆంధ్రజ్యోతి.

"...ముఖ్యముగా సారస్వతప్రియులు చదివి యానందింప దగిన గ్రంథరాజము ఈ కవిరాజశిఖామణి."

—ఆలిండియా రేడియో-విజయవాడ.

# కేయూరబాహుచరిత్రము

మంచనకవిప్రణీతము




పరిష్కర్త:

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య, యం. ఏ.

సారస్వతకుటీరము
మదరాసు -21.

# పీఠిక

కేయూరబాహుచరిత్ర మను నీ గ్రంథము నాలుగాశ్వాసముల యుత్తమ ప్రబంధము. దీనిని మంచన యనుకవీశ్వరుఁడు రచించి నండూరి గుండమంత్రి కంకితము గావించెను. గ్రంథమునుబట్టి యితని కులగోత్రాదు లేవియుఁ దెలియుట లేదు. ఆశ్వాసాంతగద్యలయం దైనను కవిపేరు దప్ప మ ఱేమియు లేదు. కాని కృతిపతి కవినిగూర్చి పలికినట్లు చెప్పినపద్యములలో 'భవ్యమతిం ద్విజదేవ నిర్మితం [illegible] విలసిల్లుతంత్రము' అని పేర్కొనఁబడి యుండుటచే నితఁడు బ్రాహ్మణకులమువాఁ డని మాత్రము తెలియుచున్నది. కృతిపతి యగుగుండన మంత్రి కృష్ణామండలమునందలి 'దనదుపుర' వాస్తవ్యుఁ డగుటచే నతనియిష్టసఖుఁ డగు నీ కృతికర్తయుఁ దత్ప్రాంతమునందలివాఁడే యగుట నిశ్చయము. ఇతఁడు రాజమహేంద్రపురనివాసుఁ డని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. కాని దాని కాధారము లేదు. ఇతఁడు 'విద్వజ్జనమాన్యుఁడు, ఉభయకావ్యసరణిజ్ఞుఁడు, ప్రాజ్ఞసంభావితకావ్యదక్షుఁడు.'

## కృతిపతి

కృతిపతి యగు నండూరి గుండమంత్రి మిగుల వదాన్యుఁడు. సరసకవిత్వ గోష్ఠీప్రియుఁడు. 'శాస్త్రపురాణాగమదుగ్ధాబ్ధిమందరాచలమతి.' బ్రాహ్మణుల కితఁడు పెక్కగ్రహారముల నొసఁగెను. వారికి వడుగులు, పెండ్లిండ్లు చేయించెను. ప్రతి సంవత్సరమును నితఁడు కాకుళేశ్వరుని తిరునాళ్లలో నర్థులకు విస్తారముగా ధన మొసఁగువాఁ డఁట! ఇట్టి యీ మహనీయుని గూర్చినవిశేషములకుఁ బద్యములు 1—5,40 నుండి 47 వఱకుఁ జూడుఁడు. ఇతని యగ్రజుఁడు కేతన కవిత్వముఁ జెప్పినవాఁడు. (చూ. 1-39.) కువలయాశ్వచరిత్ర మనుప్రబంధమును రచించినకేతనకవి యితఁడే యగు నేమో!

## కాలము

ఇతఁ డాంధ్రకవులలో నన్నయను, తిక్కనను దప్ప నితరుల నెవ్వరిని నుతింప లేదు. ఇతనికాలమును నిర్ణయించుట కితఁడు కృతిపతినిగుఱించి వ్రాసిన పద్యములే యాధారము. వెలనాటి గొంకరాజునకును, వీరరాజేంద్రచోడునికిని మంత్రిగ నుండిన కొమ్మయామాత్యుని రెండు పద్యశాసనములుఁ గూడ మన కీ కాలనిర్ణయమునకుఁ దోడ్పడుచున్నవి. ఇవి గుంటూరుమండలమందలి బాపట్లగ్రామమున శ్రీ భావనారాయణస్వామి గుడిగోడమీఁదఁ జెక్కఁబడి యున్నవి. [చూ.

నెల్లూరి శాసనములు. పుట. ౯౯౯.] శాసనములఁబట్టియు, కేయూరబాహు చరిత్రమునుబట్టియు వీరి వంశవృక్ష మిట్లు కలదు.




శాసనమునందలి 'కరగజక్షేందు' సంఖ్యనుబట్టి కొమ్మనమంత్రి శా. శ. 1082 అనఁగా క్రీస్తుశకము 1160 సంవత్సరమునం దుండినట్లు తెలియుచున్నది. ఈ కొమ్మనకుమారుఁ డైన కేతన పృథ్వీశ్వరుని మంత్రి. పృథ్వీశ్వరుని శాసనములు శా. శ. 1108 మొదలు 1128 వఱకు మాత్రమే కనఁబడుచున్నవి. శా. శ. 1128 (క్రీ. శ. 1206) సంవత్సరమునకుఁ బిమ్మటఁ గొలఁదికాలముననే నెల్లూరి నేలిన మనుమసిద్ధితండ్రి యగుచోడతిక్కరాజే పృథ్వీశ్వరుని సంహరించి యతనిరాజ్యము నాక్రమించుకొనెను. క్రీ. శ. 1206 వఱకును రాజ్యము చేసిన వెలనాటి పృథ్వీశ్వరుని మంత్రి యగుకేతనకుఁ గేయూరబాహుచరిత్ర కృతిపతి యగునండూరిగుండమంత్రి మనుమఁడు. మఱియు నీతఁడు తిక్కనసోమయాజిని నుతించి యుండుటచే నీ మంచనకవి క్రీ. శ. 1300 సంవత్సరప్రాంతమున నుండి యుండు నని తోఁచుచున్నది.

## మూలము

సంస్కృతమున రాజశేఖరకవి రచించిన విద్ధసాలభంజిక యనునాటిక దీనికి మూలము. దాని నాధారముగాఁ జేసికొని ప్రసక్తానుప్రసక్తముగాఁ బెక్కు

నీతికథలను జేర్చి కృతిపతి కోరినట్లు 'కర్ణసౌఖ్యావహ మై ప్రబంధరచనాశ్రయ మయ్యెడుమార్గ మూఁతగఁ—స్థాయిరసము శృంగారం, బై యలవడఁ గథలు నీతు లై యెడనెడ రాఁ—మంచనకవి యీ కేయూరబాహుచరిత్రమును రచించెను. తన్నుఁ బెండ్లాడినవాఁడు సార్వభౌముఁ డగు నని వరముఁ బొందినమృగాంకావళి యనుకన్యను భాగురాయణుఁ డనుమంత్రి తన బుద్ధిబలముచేఁ దన యేలిక యగుకేయూరబాహు వనుమహారాజున కాతని పట్టమహిషిచేతనే పరిణయము చేయించినకథ యిందలి యితివృత్తము. సంస్కృతనాటికయందు రాజు విద్యాధరమల్లుఁ డనియు, రాజధాని యుజ్జయినీనగర మనియుఁ గలదు. మంచన యా పేరులను మార్చి యిందు రాజు కేయూరబాహు వనియు, రాజధాని కళింగదేశమందలి త్రిపురీనగర మనియుఁ బేర్కొనెను. మఱికొన్ని మార్పులను గూడ నితఁడు సందర్భానుసారముగాఁ జేసి యున్నాఁడు. [చూ. విద్ధసాలభంజిక.]

## మంచన నన్నిచోడుని కుమారసంభవమును చదివెను

వెలనాటి చోడులశాఖకుఁ జెందిన రెండవ గొంకరాజు ద్రాక్షారామశాసనములో 'షట్సహస్రావనీనాథుఁడ' నని చెప్పుకొనినాఁడు. ఇతనియొద్దనే నందూరి గోవిందనయు, నతనికుమారుఁ డగుకొమ్మనయు మంత్రులుగా నుండిరి. ఈ రెండవ గొంకరాజు కుమారుఁడు వీరరాజేంద్రచోడుఁడు. ఇతఁడే వెలనాటి చోడఁడు. ఇతనికాలములోఁ గూడ నందూరి కొమ్మయ యితనికి మంత్రిగా నుండి యితని యాజ్ఞానుసారముగఁ 'పాకనా డిరువదియొక్కవేయి'ని బరిపాలించెను. 'ఈ రాజేంద్రచోడుఁడే యుద్ధమునందు టెంకణాదిత్యుఁ డైననన్నెచోడుని సంహరించి పాకనాడును గైకొన్నట్టు కనఁబడుచున్నది' అను వీరేశలింగముపంతులుగారి వాక్యము లిచటఁ బరిశీలింపఁ దగును. పాకనాడును జయించుటలో వెలనాటిచోడునికిఁ దోడ్పడినవాఁడు కొమ్మన. (చూ. అరు దండఁ ఇత్యాది పద్యము. 1-27) పాకనాటిని బరిపాలించిన కొమ్మనమంత్రి తన యేలిక లగు చోడభూపతులమీఁది గౌరవమున రాజరచిత మనుభావముతో రణనిహతుఁడయిననన్నిచోడుని కుమారసంభవమును ఖిలము గాకుండ భద్రపఱుపఁగా నది వారి మూలధన మై గౌరవ మందుచుండుట సంభావ్యమే. ఆ కొమ్మనమంత్రి మనుమని కుమారుఁ డగు నందూరి గుండమంత్రియింటఁ దరతరములుగా నుండిన కుమారసంభవకావ్యము నతని యిష్టసఖుఁ డగుమంచన చూచి యుండుట యసంభావ్యము కాదు.

ఇది పట్టి యభ్యూహము మాత్రమే కాదు. నన్నిచోడునివలెనే యిరువది యొక్కవేయిగ్రామములు కలపాకనాటి నితఁడును పేర్కొని యుండుట, సప్త

సంతానములను, వానిలోఁ గృతియొక్క ప్రాశస్త్యమును నన్నిచోడునివలెనే యితఁడును బ్రస్తావించి యుండుట, నన్నిచోడఁడు '...ప్రబంధము సద్రసబంధురంబుగాన్' అని రచింపఁగా నితఁడు 'ప్రబంధరచనాశ్రయ మయ్యెడుమార్గమూఁతగన్, స్థాయిరసము శృంగారం బై యలవడ' నని పేర్కొని యుండుట; నన్నిచోడఁడు మాత్రమే ప్రయోగించిన 'తా డిడి ఫలంబు గొనుట' యను నపూర్వప్రయోగము నితఁడు 'తా డిడి పండు దిన్నక్రియ' (4-145) నని యనువదించుట—నన్నిచోడుఁడు మాత్రమే వాడిన 'నోరఁగొలఁదుల్' అను ప్రయోగము నితఁడు 'నోరంగొలందులు కూయు' (4-51) అని పరిగ్రహించి యుండుట, కేళీవిహార చంద్రికావర్ణన పద్యముల పోలికలు మొదలగునవి యీ యభ్యూహమును బలపఱుచుచున్నవి. ఇందలి 4-156, 4-201 పద్యములతో నీ క్రింది కుమారసంభవపద్యములను బోల్చి చూడుఁడు:

సీ. దుగ్ధాంబునిధి నిట్టఁ దోఁచెనో యని శేషుఁ బాన్పు గా హరి నీటఁ బవ్వడింప
నొదవి సుధారస ముప్పొంగెనో యని దేవతల్ తని వోవఁ ద్రావఁ దలఁపఁ
దొలఁకాడుమిన్నేఱు వెలి విరిసెనో యని లీల సురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరఁగెనో యని సిద్ధనికరంబు కలశముల్ నించికొనఁగఁ
గీ. బాండురాంగుండు విశ్వరూపంబు దాల్చి
యొలసెనో యని సద్భక్తు లెలమిఁ గొలుప
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమల మై యలరి కాసె. [కుమా. 8.118]

సీ. కలహంసకలరవాకలితనిర్ఘరముల సారసారావాబ్జషండములను
రోలంబరుతిలతాందోలంబులను శుకమంజులస్వనపుష్పమండపములఁ
గలకంఠరణితమాకందవనములఁ బారావతధ్వనిమందిరస్థలములఁ
గేకికలధ్వానగిరికందరంబుల లావుకనినదలీలాతలముల
గీ. నప్పటప్పటి కనురాగ మగ్గలింపఁ
గామరస మంతకంతకుఁ గడలుకొనఁగ
నలి రమించిరి కైలాసనగముమీఁదఁ
బరమసుఖలీల నాజగత్పతియు సతియు. [కుమా. 2-78]

## కవిత్వము

ఇతని కవిత్వము సరస మై, సలక్షణ మై, సహృదయరంజక మై యుండును. ఇతఁడు చక్కని భావనాపటిమ గలవాఁ డనుటకు 1—43, 60 పద్యములు, 3—306 పద్యము, 4—18, 48, 49, 132, 136 పద్యములు చూడుఁడు.

ఇతని పద్యములను గొన్నిటిని జక్కన తన విక్రమార్కచరిత్రమునం దనుకరించెను. ఇందలి 1-4, 1-64 పద్యములను జక్కన తన విక్రమార్కచరిత్ర యవతారికలోని 'వనరుహనాభు డుద్భవుఁడు' ఇత్యాదిపద్యమున ననుకరించెను.

కృతిపతి యగు గుండమంత్రి కుత్తరోత్తరాభివృద్ధిగా సంపదలు కలుగవలయు నని సూచించుచు నితఁ డిందలి యవతారికలో 'కరిముఖుఁ డశ్వినుల్' (చూ. 1-2) అనుపద్యమునఁ బాటించినశిల్పము మెచ్చఁ దగినది. నీరుకైవడి (4-158), వెఱతు నంచు అనుటకు వెఱ తంచు (4-39) అను వింతప్రయోగముల నితఁడు చేసి యున్నాఁడు.

## కొన్ని సవరణలు

అర్థావగతికిని, నన్వయమునకును సనిపడున ట్లిం దందందుఁ గొన్ని సవరణలు చేయఁబడినవి. మచ్చునకుఁ గొన్ని. కృత్యాదిపద్యమున 'ప్రహృష్టరసశాంతిసముత్కర' అని పూర్వముద్రణపాఠము. పద్య మంతటఁ బాటింపఁబడిన రూపకసామ్యసిద్ధికై యచట 'ప్రహృష్టసరసార్థిసముత్కర' అని సవరింపఁ బడినది. అట్లే 'ఆపదల మదనాపద లావహిల్లె' (3-14) అని పూ. ము. 'ఆపదలమీఁద నాపద లావహిల్లె' అని యుండఁదగును. 'కటబద్ధాంబర (3-304) అని పూ. ము. పాఠము 'కటిబద్ధాంబర' అని సవరింపఁబడినది. 'జీవరమణుఁ డర్థి నుండెడునివాసము సేరి యొనర్చుకైవడిన్' అను పూ. ము. లోని యపపాఠము 'నివాసము సేరియు నార్చుకైవడిన్' అని సంస్కరింపఁ బడినది. ఇంకను గొన్నిపద్యము లర్థము కుదురక చిక్కు గొలుపుచు సంస్కారాపేక్షము లై నిలిచిపోయినవి కలవు.

## 'బాలరసాలసాల' పద్యము

ఈ గ్రంథముయొక్క యవతారికలో పోతనకవీశ్వరుఁడు చెప్పినచాటువుగాఁ బ్రసిద్ధి చెందిన 'బాలరసాలసాల', యనుపద్యము నీ మంచనకవి కృతిపతి నుద్దేశించి పలికినట్లుగాఁ గలదు. ఈపద్యము నిజముగా నరకృతివిముఖుఁ డగు పోతనవంటివాఁడు చెప్పఁదగినది కాని నందూరి గుండమంత్రికిఁ దనకావ్యము నంకిత మిచ్చినమంచన నుడువఁ దగినది కాదు. పోతరాజు మంచనకుఁ దరువాతివాఁ డగుటచేఁ బోతన రచించినపద్యము నీతఁడు తనగ్రంథమునఁ జేర్చుకొనె ననుటకును వీలు లేదు. 'అని తగనివానిదెస' యని తరువాతిపద్యము పూర్వపద్యముతోడి యన్వయముతో బ్రారంభ మగుచుండుటచే నది ప్రక్షిప్త మని కాని, ప్రతివిలేఖకు లెవరో తరువాతివారు నడుమఁ జేర్చి యుందు రని కాని చెప్పుటకు వీలు లేదు. దీనిఁబట్టి చూడఁగా నెవరో చెప్పిన యీ పద్యమును మంచన తనపీఠిక

యం బతుకకొనె ననియు, నదియే తరువాత నరస్తుతివిముఖుఁ డగుపోతన చెప్పినచాటువుగా నానాఁటఁ బ్రసిద్ధి గాంచి యుండు ననియు సంభావించుట యుక్త మని తోఁచుచున్నది.

## పాఠాంతరము

శ్రీ చాగంటి శేషయ్యగారు రచించిన ‘ఆంధ్రకవితరంగిణి’ లో నందనుఁడు వనమ్మ (1-8) అనుపద్యమునకుఁ దరువాత ‘వననిధితటాక’ (1-9) అను పద్యమునకు బదులుగా నీ క్రిందిపద్య ముదాహరింపఁ బడినది. దీని కాకర మెట్టిదో తెలియదు.

క. సొమ్ములలో ము ప్పొర్చు జ, గ మ్మెల్లను సోడుముట్టఁ గాఁ జేయును శ్లా
ఘ్య మ్మగువస్తువు నగుటను, గమ్మనికనకంబు గాదె కవిత దలంపన్.

## ముద్రణవిషయము

ఈ యుత్తమగ్రంథమును సరస్వతీపత్రికాధిపతు లగు శ్రీ పోలవరము జమీందారుగారు బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి వెంకటకవులచేఁ బరిష్కరింపించి సుమా రఱువది సంవత్సరములక్రిందట క్రీ. శ. 1902 లోఁ బ్రకటించిరి. దానికిఁ దరువాత మిక్కిలి యమూల్య మయిన యీ గ్రంథము పునర్ముద్రణభాగ్యమునకు నోఁచుకొనక పోవుటచే నేఁ డిది భాషాజిజ్ఞాసువులకు లభించునవకాశము లేక పోయినది. తిక్కన కించుక తరువాతివాఁ డగు నీ ప్రాచీనకవీశ్వరుని మేలి గ్రంథము లభింపక పోవుట మిక్కిలి శోచనీయ మని భావించి యెట్లో దీని యచ్చుప్రతి నొకదాని సంపాదించి నిర్దుష్టముగాఁ జక్కనిపాఠములతోఁ బరిష్కరించి యిట్లు ప్రకటించుచుంటిని. పూర్వముద్రణములోని పెక్కు దోషము లిందు సవరింపఁబడినవి. విజ్ఞుల కీ పరిష్కృతముద్రణము ముదము కూర్చు ననియే నా యాశయము.

ఏతద్గ్రంథమును ముద్రించుసందర్భమున నాకు మిక్కిలిగాఁ దోడ్పడిన నా శ్రీమతి నాశీర్వదించుచున్నాఁడను. దీని నిట్లు నిర్దుష్టమనోహరముగా నచ్చొత్తించి యిచ్చిన ‘ఫ్రీడమ్ ప్రెస్సు’ వారి నభినందించుచున్నాను.

ప్రాచీనకవికృతము లగు మఱికొన్ని గ్రంథములను గూడ నిట్లే చక్కఁగాఁ బరిష్కరించి ప్రకటింపవలయు నని యాశయము. ఆంధ్రమహాజను లీ పవిత్ర కార్యమునందుఁ దప్పక తోడ్పడుదు రనియే నా నమ్మిక.

—తిమ్మావఝ్ఝల కోదండరామయ్య.

శ్రీరస్తు

# కేయూరబాహుచరిత్రము

## ప్రథమాశ్వాసము

---

ఉ. శ్రీ వసియించుఁ గాత సుఖసిద్ధి వహించి యనేకబంధుహం
సావళియుం బ్రహృష్టసరసార్థిసముత్కరషట్పదంబు నై
జీవన మెప్పుడుఁ సుకవిసేవ్య మనం బొగ డొందుసర్వపు
ణ్యావహ మైనగుండసచివాగ్రణిగేహసరోవరంబునన్. 1

చ. కరిముఖుఁ డశ్వినుల్ శ్రుతులు కంజసముద్భవుమోము లంబికే
శ్వరుమొగముల్ తదాత్మజునివక్త్రము లాదిమునీంద్రమండలం
బురగపతుల్ గ్రహంబులు పయోరుహనాభుఁడు తారకంబులున్
బోరిఁబోరి నెల్లసంపదలు పోలమగుండని కిచ్చుఁ గావుతన్. 2

మ. శ్రవణానందనభారతీచతురునిం బ్రాచేతసుం దివ్యస
త్యవతీనందనుఁ గాళిదాసుఁ గృతికర్తన్ గొల్చి వాక్పూర్ణమే
రువులన్ నన్నయభట్టుఁ దిక్కకవిచంద్రున్ భక్తితోఁ గొల్చి యు
ద్ధవచాణక్యయుగంధరాదినయవిద్యాకోవిదధ్యాని నై. 3

వ. ఇట్లు కృతిప్రారంభకర్తవ్యంబు లాచరించి యున్నవాని. 4

సీ. తనపేరిసొబగు మేదిని నెల్లవారికి వీనుల కమృతంపువాన గురియఁ
దను నాశ్రయించినజనులమందిరములు తొమ్మిదినిధులను దొంగలింపఁ
దనకీర్తికామిని యనిశంబుఁ గైసేసి యేడుసంద్రములందు నీడఁ జూడఁ
దనయొప్పు నూచుకాంతల కొండుమారుండు లేఁ డనుబుద్ధి గల్గించుచుండ

గీ. నెగడు బ్రహ్మవంశనీరధిసంపూర్ణ, చంద్రముఁడు కళావిశారదుండు
నైజధార్మికుండు నండూరిగుండన, మంత్రి నిఖిలమంత్రిమండనంబు. 5

వ. నిరంతరసరసగోష్ఠీనిష్ఠుండు గావున నొక్కనాఁ డుచితకథాశ్రవణప్రసంగంబున. 6

క. తనయిష్టసఖుని విద్వ, జ్జనమాన్యుని నుభయకావ్యసరణిజ్ఞుని మం
చననామధేయు నన్నుం, గనుఁగొని యి ట్లనియె వినయగౌరవ మెసఁగన్. 7

గీ. నందనుఁడు వనమ్ము నల్లిల్లు నిధి సుర,గృహము చెఱువు మేలికృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు వీనఁ,బుణ్యములు యశంబుఁ బొందవచ్చు. 8

క. వననిధితటాకదేవభ, వనములు పుణ్యాదము లైన వాని ననుష్ఠిం
చినచోన కాని యెఱుఁగరు, చనుఁ గాదే సరసకవిత సకలదిశలకున్. 9

ఉ. కావున నాకు నొక్కకృతిఁ గైకొన నిష్టము నీవు ప్రజ్ఞ సం
భావితకావ్యదక్షుఁడవు భవ్యమతిం ద్విజదేవనిర్మితం
బై విలసిల్లుతంత్రము ప్రియంబునఁ జూచిన నందుఁ గర్ణసౌ
ఖ్యావహ మై ప్రబంధరచనాశ్రయ మయ్యెడుమార్గ మూఁతగన్. 10

క. స్థాయిరసము శృంగారం, బై యలవడఁ గథలు నీతు లై యెడనెడ రాఁ
గేయూరబాహుచరితము, సేయుము నీ వాంధ్రభాష శిల్పము మెఱయన్. 11

వ. అని పలికి బహుమానపూర్వకంబుగా నంబరాభరణాదివివిధపదార్థసహి
తంబుగాఁ దాంబూలం బిచ్చినం బుచ్చుకొని. 12

ఉ. బాలరసాలపుష్పనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికు లైన నేమి మఱి యంతకు నాయతి లేనినాఁడు కౌ
ద్దాలికు లైన నేమి నిజదారసుతోదరపోషణార్థ మై. 13

క. అని తగనివానిదెస నా, మన మెప్పుడు రోయుఁ గాన మతిమజ్జనవ
ర్ణనలకు మిగిలినసుగుణుని, నినుఁ బొంది మదీయకవిత నెగడుం బుడమిన్. 14

వ. కావున నీకుం గృతి యిచ్చెద నని యొడంబడి పురాతనాధునాతనకవి
నమస్కారంబుఁ గావించి వారి యనుజ్ఞ వడసి భారతిం బ్రార్థించి పునఃపునః
ప్రణామంబు లాచరించి యగ్గుండనామాత్యువంశక్రమంబు జగత్ప్రసిద్ధం
బైననుం గృతిలక్ష్మికి ముఖతిలకంబుగా రచియింతు నది యె ట్లనిన. 15

సీ. జనపాలనుతసింహచక్రవాలంబు సామంతనిర్మలరత్నమండనంబు
రాజతురంగతరంగపయోనిధి భద్రేభమేఘనభస్స్థలంబు
భూదేవదేవజాంబూనదాచలము వదాన్యకల్పకదేవతాపురంబు
బహుకళాకర్పూరభాసికరండంబు సుజనముక్తాఫలశుక్తిచయము
గీ. చతురకాంతాప్రసూనవసంతకేళి, రసికవిటజనమధుకరారామలక్ష్మి
మధురకవిరాజనవహంసమానసంబు, నాఁగ దనదుపురంబు వర్ణనలఁ దనరు.

వ. మఱియును. 17

సీ. పుష్పకనివహంబు భూమిపై నిలిచినయ ట్లంద మైనదేవాలయములు
రూప్యాచలము బహురూపంబుల నటించురమణ శోభిల్లుసౌధముల పెల్లు

నలకాధిపతి నిధు లన్నియు వెలివీట విడిసినక్రియఁ బణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుఁ దఱఁగి వైచినమాడ్కిఁ గనుపట్టుబహుతటాకములు సొంపు
గీ. నుపవనంబులు సరసులునొప్పుచేయు, చెఱకుఁదోఁటలుఁ బ్రాసంగుచేలు మెఱయ
నఖిలవిభవంబులకు నెల వగుచు వెలయు, ధనదుపురమున కెన యన దనదుపురము.

గీ. మంటికడవ నులకమంచంబు పూరిల్లు, నూలిచీర రత్నకీలితంబు
గాని పైఁడితొడవు గలుగు టెఱుంగరు, దనదుపురములోనిజనము లెల్ల. 19

శా. ప్రాగ్దిక్పశ్చిమదక్షిణోత్తరదిశాభాగప్రసిద్ధక్షమా
భుగ్దర్పాంతకుఁ డేలె గొంకవిభుఁ డీభూచక్ర మక్రూరతన్
వాగ్దేవీస్తనహారనిర్మలయశోవాల్లభ్యసంసిద్ధితో
దిగ్దంతిశ్రవణానిలజ్వలదటత్తీవ్రప్రతాపాఢ్యుఁ డై. 20

క. ఆవిభునకుఁ బ్రెగ్గడ యై, భూవలయంబున యశోవిభూషణుఁ డయ్యెన్
గోవిందనప్రధానుం, డావాసము కౌశికాన్వయం బాయనకున్. 21

మ. విహితాస్థానములందుఁ జూపుఁ దగ గోవిందాభిధానప్రభుం
డహితోర్వీధరవజ్రి గొంకవిభురాజ్యాధిష్ఠి యై సంధివి
గ్రహముఖ్యోచితకార్యసంఘటనవాక్ప్రౌఢత్వమున్ బాధస
న్నహనోదగ్రరిపుక్షితీశబహుసైన్యధ్వంసనాటోపమున్. 22

క. ధీరుం డాగోవిందన, కూరిమినందనుఁడు వెలసెఁ గొమ్మన గొంక
క్ష్మారమణున కుదయించిన, వీరుఁడు రాజేంద్రచోడవిభుప్రెగ్గడ యై. 23

సీ. నవకోటిపరిమితద్రవిణ మేభూపాలుభండారమున నెప్డుఁ బాయ కుండు
నేకోనశతదంతు లేరాజునగరిలో నీలమేఘంబులలీలఁ గ్రాలు
బలవేగరేఖ నల్వదివేలతురగంబు లేనరేంద్రునివాగె నెపుడుఁ దిరుగుఁ
బ్రతివాసరంబు డెబ్బదియేనుపుట్లు నై, యేవిభుమందల నెపుడుఁ గల్గు
గీ. నట్టి యధికవిభవుఁ డగుకులోత్తుంగ రా, జేంద్రచోడనృపతి కిష్టసచివ
తంత్రముఖ్యుఁ డనఁగుమంత్రి గోవిందనం, దనుఁడు కొమ్మనప్రధానుఁ డొప్పు.

ఉ. ఇల వెలనాటిచోడమనుజేంద్రునమాత్యత యానవాలుగాఁ
గులతిలకంబుగా మనినకొమ్మనప్రెగ్గడకీర్తిమాటలన్
దెలుపఁగ నేల తత్క్రియఁ బ్రతిష్ఠిత మైనతటాకదేవతా
నిలయమహాగ్రహారతతి నేఁటికి నెల్లెడఁ దాన చెప్పఁగన్. 25

సీ. రమణీయ మైనకూర్మగ్రామమునయందు గురుదుర్తిపురమునఁ గ్రొత్తచర్లఁ
ద్రిపురాంతకమునఁ జేర్చినకొట్టిదొనబొగ్గరమునఁ గళింగరాష్ట్రంబులోని

యెలమంచి లాదిగా నెలమి ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు వెలయఁ జేసి
నిచ్చె వేవురు మేదినీసురవరులకు బంతి సద్భక్తితోఁ బాయసంబు

గీ. దనర నిడుటయె జన్మవ్రతంబు గాఁగ, మనువు నడిపినకొమ్మనమంత్రివరుని
బుద్ధిలోన బృహస్పతిఁ బోలువానిఁ, బోలఁ గలుగుదురే ధర్మపురుషు లెందు. 26

మ. అరు దందన్ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిం జని యేకవింశతిసహస్రగ్రామసంఖ్యాక మై
ధరణిం జేర్చినపాకనాడు నిజదోర్దండైకలగ్నంబుగాఁ
బరిపాలించె సమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాతచారిత్రుఁ డై. 27

క. చలము మెయిఁ గటకసామం, తులు గరిహయబహుళసేనతో నేతేఱన్
దలపడియెఁ గొమ్మసచివుఁడు, బలియుం డై క్రొత్తచర్లపరిసరభూమిన్. 28

సీ. సెలకట్టెవాటునఁ జెలఁగి రెంటిని మూటిఁ గూడ గుజ్జంబులు గుదులు గ్రుచ్చుఁ
బ్రతిమొగం బగునరపతులకత్తళములఁ గడిమిమై వీఁపులు వెడలఁ బొడుచుఁ
బందంపుగొటియలపగిది నేనుంగుల ధారశుద్ధిగ నసిధారఁ దునుముఁ
జిదియించుఁ బగిలించుఁ జేతులతీఁట వోవడిఁ గాండ మేసి మావఁతులతలలు

గీ. తల పుడికి వ్రేసి మావంతుతలలు శత్రు, రాజశిరములు ద్రొక్కించు రాఁగఁదిరుగ
వాగె నుబ్బెడుతనవారువంబుచేత, మహితశౌర్యండు కొమ్మనామాత్యవరుఁడు.

చ. అరిగజకుంభపాటనవిహారము కొమ్మనమంత్రి సల్పుచో
నురివినమౌక్తికవ్రజము లుర్విపయిం బొలిచెం దదీయసం
గరహతవీరదోర్గ్రహణకౌతుకసంభ్రమఖేచరీపర
స్పరతనుమర్దనోద్గళితభాసురహారమణీచయం బనన్. 30

క. ఆకొమ్మనప్రెగ్గడసుతుఁ, డై కేతన చోడభూవరాత్మజుఁ డై దై
ర్యాకరుఁ డగుపృథ్వీశమ, హీకాంతునిమంత్రి యయ్యె నెంతయుఁ బేర్మిన్. 31

ఉ. కౌశికగోత్రభూసురశిఖామణి కేతనభూవరుండు పృ
థ్వీశనరేంద్రుమంత్రి యయి యెల్లెడఁ జాలఁ బొగడ్తకెక్కె నా
కాశనదీమరాళశివకాశసురాశనతారకేశనీ
కాశతరాధిరోచిరవకాశవికాసయశోవిశాలుఁ డై. 32

ఉ. కేతనమంత్రినందనులు కీర్తి వహించిరి బంధుజాతవి
జ్ఞాతవినీతభావుఁ డనఁ జాలినకొమ్మనదండనాథుఁడున్

బ్రాతరహర్పతిప్రతిమభాసురతేజుఁడు మల్లశౌరియున్
బ్రీతసమస్తసజ్జనుఁడు భీమనప్రెగ్గడయుం గులాగ్రణుల్. 33

ఉ. అందఱిలోనఁ బ్రాయమున నారసి చూడఁగఁ జిన్న యయ్యుఁ బెం
పొందిగుణంబులం బొగడ నొందె ధరిత్రి నమాత్యభీముఁ డా
నందము తల్లిదండ్రులు మనంబున నొందఁగ మందిరంబునన్
గుందవరాచ్ఛకచ్ఛపముకుందము లందము పెంపుఁ జెందఁగన్. 34

సీ. క్షితిఁ గశ్యపప్రజాపతిమన్మఁడై తాను బుట్టుట నతనిన పోలు ననుచు
జను లెల్లవారును దను నెంచ నెగడినగుండదండాధీశుకూర్మిపుత్రిఁ
బుణ్యలక్షణమూర్తిఁ బోలన మారన పేరన లాదిగాఁ బేరు గలుగు
సచివసప్తకముతో జనియించి మును గులభూధరంబులతోడఁ బుట్టినట్టి
గీ. వసుమతీదేవి కెన యనవచ్చుపోల, మాంబఁ బెండ్లాడెఁ దనయన్వయంబు పావ
నంబు లోకంబు కీర్తిఁ బూర్ణంబు గాఁగ, భీమనామాత్యుఁ డరిరాజభీకరుండు.

సీ. పుణ్యంబుమడి మోచుపాలఁతుల కెల్ల నీవువఁబోడి యాఁదలభూషణంబు
పతియాజ్ఞ దల నిడి బరి యింత గడవనిలలనల కీయింతి తిలకలక్ష్మి,
తొడి పూసి కట్టి బంధువులకు నిడి యున్నపడఁతుల కీపుణ్యభామ యొజ్జ
కడుపు చల్లఁగ మేలికొడుకులఁ బడసినసుదతుల కీచామ మొదలిపేరు
గీ. తాల్మిగని యొప్పుకందువ తగవు నెలవు,ధర్మములయిక్క మొగమాటతానకంబు,
సుగుణములతావు వినయంబుచోటనంగఁ,బోలమాంబిక యెల్లెడ బొగడ నెగడె.

చ. అతిశయపౌరుషైకపరు లై జనియించిరి పుత్రు లట్టిజం
పతులకు మువ్వు రుత్కటకృపానిధి కేతనదండనాథుఁడున్
క్షితిధరతుల్యుఁ డైనచిన కేతనమంత్రియు సర్వసద్గుణా
యతనసుబుద్ధి గుండసచివాగ్రణియున్ నిజవంశభూషణుల్. 37

ఉ. రోహణపర్వతంబునఁ బ్రరూఢము లైనయనర్ఘరత్నసం
దోహమునట్టినందనులతోఁ దనవృద్ధియు బంధురక్షణో
త్సాహము బ్రాహ్మణోత్తముల ధన్యులఁ జేయుగుణంబు సత్కళా
గేహవిశుద్ధబుద్ధి యగు కేతనమంత్రికి నొప్పు నెప్పుడున్. 38

ఉ. నూతనదర్పకుం డన మనోహర మైనసురూప మొంది వి
ఖ్యాతకవిత్వసంపదఁ బొగడ్తకు నెక్కి యశేషబాంధవ
వ్రాతహితాత్ముఁ డై గణకవర్గకళామహిమన్ బ్రగల్భుఁ డై
కేతనమంత్రి దిగ్భరితకీర్తి వహించె నమాత్యకోటిలోన్. 39

శా. పుట్టెం గుండన బంధుకోటులతపఃపుణ్యప్రభావంబుతోఁ
జెట్టెం బాదము భూమి నప్రతిమమై పెంపారుభాగ్యంబుతోఁ
గట్టెం జీర విరోధిమానవమనోగర్వప్రపంచంబుతోఁ
బట్టెం గంటము సర్వదీనభరణప్రౌఢవ్రతప్రీతితోన్. 40

ఉ. భారతి దాది వెన్నిధులు బాలసఖుల్ తొలువిద్య నిశ్చలో
దారత ధర్మకృత్యము లుదాత్తవిభూషణముల్ వివేకవి
స్తారము యౌవనంబు బుధసంగతి వ్రాతజనప్రశస్తి ది
క్పూరితకీర్తితోయనిధి భోగము భీమయగుండమంత్రికిన్. 41

సీ. పుణ్యనదీతీరభూమిఁ దా నిలిపినపల్లిండ్ల విప్రగణంబుచేత
సరసకవిత్వప్రసంగతిఁ దనుఁ బ్రీతిఁ గొనియాడుసత్కవిజనులచేతఁ
గర్పూరకస్తూరికాముఖద్రవ్యానుభవవేళ సభలోని ప్రభులచేతఁ
గాంక్షమైఁ దనుఁ బొందఁ గాంతుమో యని యుపశ్రుతులు వోయెడువధూవితతిచేత
గీ. దానశక్తి బహుకథానిపుణత్వంబు, సులభభోగమహిమ సొబగుపేర్మి
నెగడుచుండ వెలసె జగతీతలంబున, మంత్రిగుండఁ డమలమతిగురుండు. 42

శా. శైలవ్రాతము వారిసత్త్వములు భాస్వత్ఫేనముల్ తారకా
జాలంబుల్ భుజగాధినాయకఫణాచంచన్మణుల్ రత్నముల్
వేలాసేతువు చక్రవాళగిరి పృథ్వీనాథసన్మంత్రిచూ
డాలంకార మమాత్యగుండని సముద్యత్కీర్తిదుగ్ధాబ్ధికిన్. 43

సీ. వసుగుఁ బెండిలిఁ జేయ వయసైనవిప్రులఁ దడవి సేయించు నీపుడమి యెల్లఁ
వ్రోడఁ బూయఁ గట్టంగ నిడఁ గల్గునట్లుగ సహకుటుంబులఁ గవిజనులఁ బ్రోచుఁ
పాఠకగాయకప్రముఖుల మన్నించి యాందోళికాదివాహనము లొసఁగుఁ
బాటించి కాకుళేశ్వరుతిరునాళ్ళలో నర్థుల కేఁటేఁట నర్థ మిచ్చు
గీ. ధర్మజుఁడు భానుజుఁడు తొంటితప్పువాయ, దేహ మేకమై పుట్టిన తెఱఁగు దోఁపఁ
దామ మును దానధర్మముల్ దన్నుఁ బొందె, మంత్రిభీమనగుండనామాత్యమణికి.

చ. నలువుగఁ గాకుళేశుతిరునాళులలోపల గుండమంత్రి ని
ర్మలమతి బిట్టు వేగముగ మాడలు రత్నచయంబుఁ జల్లఁగా
నలవడుహేమవృష్టిక్రియ నర్థులు చాతకకోటి గాఁగ లోఁ
గలకొన రాలుముత్యములు గాఁగఁ బడున్ వడగండ్లకైవడిన్. 45

సీ. వాచకత్వము లేఖనోచితత్వము నాంధ్రలిపిరీతిగా సర్వలిపులయందు
ఫణితి జాతియుఁ దీవ్రభంగియును దెనుంగుబాసపోలిక సర్వభాషలందు

వదనవికాసంబు మృదువాక్యతయు బంధుజనులయట్లన సర్వజనులయందు
మర్మజ్ఞతయుఁ బ్రౌఢమతియును గణకత్వవిద్యయట్లనె సర్వవిద్యలందు
గీ. మన్ననయును నిర్వంచనమతియు మిత్ర
గణములట్లనె సర్వార్థగణములందు
ననుట సహజంబు లివియు వర్ణనలు గావు
గుండనామాత్యునకు మంత్రికుంజరునకు. 46

క. ఈగుండయప్రెగ్గడకును, ధీగుణచింతామణికి నతిస్థిరధర్మో
ద్యోగమతికి శాస్త్రపురా, ణాగమదుగ్ధాబ్ధిమందరాచలమతికిన్. 47

వ. ఇష్టార్థసిద్ధియు నైశ్వర్యసమృద్ధియుఁ బుత్రపౌత్త్రాభివృద్ధియుఁ గా నారచి
యింపం బూనినకథాక్రమం బెట్టి దనిన. 48

—: కథాప్రారంభము :—

క. అపరిమితవిభవ మై ధా, త్రిపయిం బరఁగినకళింగదేశములో నిం
ద్రుపురంబుఁ బోలె నొప్పుం, ద్రిపురీనగరంబు సంస్తుతికిఁ బట్టగుచున్. 49

క. ఉరగస్త్రీజలకేళీ, కరణంబులు దేవకన్యకాక్రీడాసం
చరణంబులు తమ కనురఁగఁ, బురికిం బరిఘలును సాలములు నొప్పెఁ గడున్.

మ. నవముక్తాఫలరాసులున్ రుచిరనానాసన్మణిశ్రేణి శు
క్తివితానంబులు హేమవాలుకలు నక్షిప్రీతి సంధించుచున్
భువనస్తుత్యము లై పురాంగణము లొప్పుం జూడఁగాఁ గుంభసం
భవపీతాంబునిధిస్థలాభినవవిస్తారంబు లై యెప్పుడున్. 51

చ. మిగిలినవేడ్కఁ నాట్యములు మీఁదటివేల్పులు చేయఁ దన్మృదం
గగణనినాదముం దఱచుగాఁ శిఖరంబులఁ బట్టియున్నయ
మ్మొగులులప్రోఁతయుం గదిసి ప్రోసిన నొక్కొకమాటు తాళవృ
త్తిఁ గని యెఱుంగ వచ్చుఁ బురిదేవగృహంబుల మర్దళధ్వనుల్. 52

క. పురహర్మ్యవిహారిణు లగు, తరుణులవదనములతోడఁ దడఁబడు నని పం
కరుహాభవుఁ డెఱుక యిడెఁ గా, కరయం గందేల యిందునందు ఘటించున్.

చ. అనిశము మీఁదటన్ మెలఁగునంగనలం గని నాఁడునాఁటికిం
దనికినకామవేదన సుధారుచి చల్లనిపట్ల విశ్రమిం
చెనొ యనఁ జంద్రకాంతకృతశీతలనిర్మలచారువేదులం
జెనుపుగ రాత్రులందుఁ బ్రతిబింబము లెంతయు నొప్పు మేడలన్. 54

చ. కలితకపోలసాంద్రమదగంధవశభ్రమితాళిమాలికల్
పలుమఱు మీఁద మూఁగినబలాహకమై కనుపట్టి శీకరం
బులు బహునిర్ఝరంబులుగ బొల్లను జేగురు సూర్యకాంతభం
గులుగఁ బురంబులోన నడకొండలఁ బోలి చరించు నేనుఁగుల్. 55

చ. ఒడళులు కానకుండఁ బడి యుండెడుగాడ్పులు దీర్ఘపక్షముల్
విడిచి ధరం జరించునహివిద్విషు లద్దిననూత్నరూపముల్
వడసినచిత్రముల్ చెవరఁ బాజీన వెల్లను గూర్చి యొక్కచో
నిడినజెడంగుప్రోగు లన నెంతయు నొప్పఁ బురిం దురంగముల్. 56

ఉ. అత్రిసమాను లర్జునసమాధికశూరులు దేవవర్ణినీ
పుత్రమహాధనుల్ విదురపూర్ణగుణుల్ మదనాయుధోపమా
పాత్రము లుగ్రసింహనిభబాహుబలుల్ దలఁపంగ బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రగణకాసుభటోత్తము లప్పురంబునన్. 57

చ. సరసిజపత్రలోచనలచందనచర్చల నొందుచుం దలో
దరుల మొగంపుఁగప్పురపుఁదావులతో సరసంబు లాడుచున్
దరుణుల గట్టిచన్నుఁగవఁ దాఁకుచు ధన్యత తన్నుఁ బొందఁగాఁ
దిరుగుచు నుండు నింపు గల తెమ్మెర లెప్పుడు నప్పురంబునన్. 58

మ. లలనారోహణవాద్యమానబహుడోలాఘంటికానాదముం
గలధౌతోజ్జ్వలపంజరాకలితశౌకశ్లోకికారావసం
కులముం జంచదమందషట్పదపదీకోలాహలంబుల్ కడున్
దల మై మర్దళదుందుభిప్రభృతివాద్యస్ఫూర్తి తోఁచుం బురిన్. 59

చ. దలముగ నెల్లప్రొద్దును లతానివహంబులఁ గాఱుపుప్పొడుల్
పులినతలంబు లై చెలువుఁ బూనఁగ మీఁదటఁ దేలు కేతకీ
దళములమొత్త మోడలవిధంబునఁ దేలఁగఁ బాఱుఁ బెద్ద లై
ఫలరసవాహినుల్ పురియుపాంతవనంబులఁ గొన్నిచోటులన్. 60

వ. ఆట్టిపురంబున కధీశ్వరుండు. కేయూర బాహుని పరిచయం. వర్ణన. 61

చ. దశరథరాముతమ్ముఁ డనఁ దాఁ దగులక్ష్మణుపుత్రుఁ డై యశో
వశుఁ డగుచంద్రకేతునకు వంశజుఁ డైనమహేంద్రపాలుఁ డా
శశధర మాదినేళ మనఁ జాలుప్రతాపముతో జగం బక
ర్కశుఁ డన నేలె నానృపతిగాదిలిపట్టి కులావతంస మై. 62

సీ. తనకృపాజలధికి ధరణీతలంబుపై మానవేంద్రులు నీటిమానిసులుగఁ
దనకీర్తి దశదిశాంగనలపాపటబొట్టులకును ముత్తెంపుసూచకము గాఁగఁ
దనవాలు రిపుసంఘమునకు బద్ధకవాటగోద్వారమునఁ గుంచెకోల గాఁగఁ
దనమూర్తి కామినీజనచకోరికలకుఁ బార్వణచంద్రబింబంబు గాఁగఁ
గీ. దనరుసుదయాస్తశిఖరులు దనప్రతాప
దీపికాస్తంభయుగ్మమై తేజరిల్ల
నెగడె నాదిమహీనాథనిభమహాప్ర
భావుఁ డనఁ జాలుకేయూరబాహువిభుఁడు.

మ. చతురప్రజ్ఞుఁడు చంద్రగుప్తున కిలం జాణక్యభంగిన్ దివ
స్పతికిం దైవతమంత్రియోజ సుమనశ్శ్లాఘ్యుండు వత్సావనీ
పతికిం దొంటి యుగంధరాఖ్యగతి శుంభత్పుణ్యుఁ డమ్మేదినీ
పతికిం బ్రెగ్గడ భాగురాయణుఁ డనం బ్రఖ్యాతుఁ డిద్ధస్థితిన్. 64

సీ. ఆరోగ్యవద్దేహుఁ డాకారశాలి వంశక్రమాగతసువిస్తారబుద్ధి
ధీరుఁ డాఢ్యుండు గంభీరుఁ డవ్యసని ప్రజానందకతుఁడు దయాన్వితుండు
నిజమర్మగోపననిపుణుండు పరమర్మభేదననిపుణుఁడు సాదరోక్తి
శీలుఁ డాచారవిశిష్టుండు సర్వవిద్యానిధి ఘనుఁ డుత్తమాన్వయుండు
గీ. లీలవాఁడు శూరుఁ డాలస్యరహితుఁ డౌ
చిత్యపరుఁడు నిఖిలచిత్తవిదుఁడు
భర్తవలను గలఁడు భక్తుండు చెలికాఁ డ
నంగ మంత్రిముఖ్యుఁ డతఁడు వెలసె. 65

ఉ. రాజకళాసరోజవనరాజమరాళి యుపాయసాయక
భ్రాజితచాపశింజిని పరాక్రమసంభృతవైరిభూపతి
శ్రీజనయిత్రి ధర్మపరిశిక్షితవర్తన మేదినీప్రజా
రాజగళత్సుధారసతరంగిణి యాతనిబుద్ధి యారయన్. 66

శా. క్షోణీశోత్తముఁ డైనభూపతికిఁ దేజోరాశికిం దేవి యై
యేణీలోచన రత్నసుందరి యనన్ హేలామనోహారి క
ళ్యాణాకార సరోజగంధి కుచభారానమ్రతన్వంగి య
క్షీణప్రౌఢవివేకమాన యగుచుం జెల్వొందు నత్యంతమున్. 67

శా. ఆలీలావతితోడ నావిభుఁడు కామాసక్తరాగక్రియా
లోలుం డై విహరించు నెప్పుడును సంలుప్తావనీశౌర్యుఁ డై

కేళీపర్వతరత్నకందరములన్ గ్రీడానివాసంబులన్
లీలోద్యానమదాళిసంతమసవల్లీగేహమధ్యంబునన్. 68

చ. నిడుపులు గానియల్కలను నిండి తొలంగుచు నుండుకాంతలన్
దడఁబడుకామతంత్రములఁ దప్పు లెఱుంగనితత్తరింతలన్
గడపట లేనికూటములఁ గప్పెడుచొక్కులఁ గాన రెన్నఁడున్
బడతియు మేదినీశుఁడుఁ బ్రభాతమురాకలు రాత్రిపోకలున్.

సీ. అంగనాకుచమండలాసక్తమై బుద్ధి భూమండలముదెసఁ బోవ దయ్యె
అలనభ్రూచాపవిలాసంబు మెచ్చులఁ జాప మెన్నఁడు దృష్టి సైఁప దయ్యె
భామినీరుచిరాంగపరిరంభలోలత సప్తాంగరక్షణస్మరణ మెడలెఁ
దరళాక్షిచూడ్కులఁ దా నాజ్ఞపడి యున్కి ధర నాజ్ఞ చెల్లించుతగవు మఱచె

గీ. రమణితోడి సతతరతిరాజతంత్రమో, హమున రాజ్యతంత్రవిముఖుఁ డయ్యె
నవనిపతికి యోషిదనురాగవారాశి, సోడు ముట్ట నోలలాడుచుండి. 70

ఉ. ఏకరసప్రమత్తుఁ డగు నేలికచందముఁ జూచి గాఢచిం
తాకులబుద్ధియై తలరి యాతనిప్రెగ్గడ భాగురాయణుం
డీకొఱగానిచందముల నీనరనాథునిఁ బాప నేక్రియం
జేకుఱు నా కుపాయ మని చిత్తములోనఁ దలంచుచుండఁగన్. 71

క. నానాదేశమ్ములకును, దా నటుఁ బనుపంగఁ జనినతనచారులలో
ధీనిధి మతిమంతుఁ డనం, గా నొక్కఁడు వచ్చి సమయక రవ్యంబుల్. 72

వ. నడపి యుండ నేకాంతం బిచ్చిన వాఁడునుం దన యరయం బోయిన లాటదేశమందలి విశేషంబు లెఱింగించి మహారాష్ట్రాధినాథుం డగుపరిఘబాహుండు తనమీఁద దండెత్తి వచ్చు చునికి విని యతని యుద్ధతి యోర్వక లాటేశ్వరుం డగుచండవర్మ చింతించుచున్నవాఁ డనియుం జెప్పి మఱియు నిది యొక్క రహస్యం బెవ్వ రెఱుంగనియది యవధరింపు మని యిట్లనియె. 73

సీ. సచివభూషణ! లాటజనపతి యొక కూఁతుఁ ద్రిభువనసౌందర్యవిభవలక్ష్మి
యగుదానిఁ గని తన యన్వయంబునఁ బూర్వు లేకసంతతు లగు టెఱిఁగి తనకుఁ
బుత్రుఁ డంతకు మున్ను బుట్టమి నీ బిడ్డ నింతిఁగాఁ గెలనివా రెఱిఁగిరేని
నిటమీఁద గద్దియ కెవ్వరు దిక్కు లే రని చుల్కఁగాఁ జూతు రని తలంచి

గీ. తాను దేవియు దాదియుఁ దక్కఁ బట్టి
నంత నుండియు నికార్య మన్యు లెఱుఁగ

ఖండ సుతుఁ డని బ్రోయించె యుక్తిపేర్మిఁ
బెనుపఁ బెరిఁగి యక్కన్య జవ్వనము చెంది. 74

క. ఉనికియు నవ్వనితం బొం, దినపురుషుఁడు సార్వభౌమ తేజోమహిమం
గను నని యొకముని యేకత, మునఁ దత్పితృజనులతోడ మును జెప్పుటయున్.

వ. అక్కన్నియపేరు మృగాంకావళి యై యుండ మృగాంకవర్మ యని పుత్త్ర నామంబుగాఁ బిలుతు రనియును విన్నవించిన మెచ్చి వానికిఁ దగినపసదనం బిచ్చి వీడుకొలిపి భాగురాయణుం డంతట. 76

శా. గాళీనిర్జరరాజనందనుని బంగాళీముఖాబ్జార్కు నం
ధ్రీలీలాంగజు ఘూర్జరీరతికళాదీక్షాసముద్భాసితున్
జోళీలోలవిలోచనోత్పలసుధాంశుం గుంతలీభద్రు నే
పాళీనూతనకూచిమారుఁ గుకురీప్రత్యగ్రపాంచాలునిన్. 77

క. పురుషార్థగుణప్రీతుఁ, హరిభక్తిసుగంధిమానసాంభోజాతున్
నిరుపమసద్గుణహారుఁ, ధరణీకల్పద్రుమాభిధానఖ్యాతున్. 78

మాలిని. సకలసుగుణవారుఁ సర్వలోకోపకారుఁ
సురుచిరమణిహారుఁ సుందరీచిత్తచోరుఁ
నిరుపమధృతిహారుఁ నీతివిద్యావిహారుఁ
బురుమతనుసుమేరుఁ బోలమాంబాకుమారున్. 79

గద్య—ఇది సకలసుకవిజనవిధేయ మంచన నామధేయప్రణీతం బైన కేయూరబాహుచరిత్రం బనుమహాప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము.

పుత్రసంతానం లేకపోతే గద్దెనెక్క వారసులు లేరని గొడవకొస్తారనే భయంతో
(ఆ రాజూ, రాణీ) కూతురునే కొడుకుగా బయటి జనాలకి చెప్పడం.
దాని పేరు మృగాంకావళి అయితే మృగాంకవర్మ గా
పిలుస్తారట. ఈ సంగతి మృగాంకవళి తల్లి, దాది
తప్ప. వెంటనే ఈ యుద్ధం చేయని రాజుకి ఈ మృగాంకావళినిచ్చి
పెళ్లి జరిపించమని భాగురాయణుడు తంత్రం పన్నుతాడు.

బియ్యానికి సమానమైన నూనెనిచ్చి బియ్యంకొన్న తెలివైన కోమటిపిల్ల కథ

శ్రీరస్తు

# కేయూరబాహుచరిత్రము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరమణకటాక్షసుధా, సారవివర్ధితవిశిష్టసంపత్సాఽ
ధారు సదాచారు యశః, స్తారకితదశాశు గుండదండాధీశున్. 1

ఉ. తనమేనల్లుని సోమదత్తు బహుతంత్రప్రౌఢు ధీమంతుఁ జ
య్యన నచ్చోటికిఁ బిల్వఁగాఁ బనిచి యేకాంతంబునన్ రాజ
వర్తనముం జారులచేత విన్నవియు మీఁదం దాను జేయం దలం
చినకార్యంబులుఁ జెప్పె విస్మితరుచిశ్రీవక్త్రుఁడై వానికిన్. 2

క. మతియుతుఁడు గావె లాట, క్షితిపతి యిటు గార్యగుప్తి సేయఁగ వలదే
మతి యింత లేక బహుజన, పతి నయ్యెద ననుట పిన్నపనియే తలఁపన్. 3

వ. అనవుడు సోమదత్తుఁ డాసచివోత్తముతో ని ట్లనియె. 4

క. పొసఁగఁ బరికింప నేర్చిన, వసుమతిపై బుద్ధి గలుగువారలు ప్రాఁతే
యసదృశగుణబహురత్నా, వసుంధరా యనుట నేఁటివచనమె చెపుమా. 5

క. ఏల వెఱఁగంద నొకరుని, పాలిటిదే బుద్ధి వైశ్యబాలిక వినవే
ప్రాలసరి తైల మమ్మియుఁ, దా లాభముఁ గొనదె తొల్లి తద్‌జ్ఞులు మెచ్చన్.

వ. అక్కథ యించుక యవధరింపు మని యి ట్లనియె. బియ్యానికి సరితైలమిచ్చిన వైశ్యబాలిక కథ

క. కాంచీపురమున నొకరుఁడు, కాంచనగుప్తుఁ డను బుద్ధి గలవైశ్యుఁ డని
ర్వంచనుఁడు సుతున కరయం, బంచెం బరిణయము సేయ బాలిక నొకతెన్. 8

చ. పనిచిన వారు వైశ్యకులబాలలఁ జూచుచు నప్పురాంగణం
బున నొకచేవ నొక్కరుఁడు మూఁటెఁడు ప్రాలకు నూనె సంతలోఁ
గొనఁ జనుదెంచి బియ్యమునకున్ సరి తైలము వోయు మన్న నా
తనిపలు కెవ్వరున్ వినక తద్దయు నవ్వుచు గేలి సేయుచున్. 9

క. ప్రా లేడుమానికెలకుం, దైలము మానెఁడు పురమ్మ్రధారణ గలుగన్
ప్రాలసరి తైల మడిగిన, జాలియ యగుఁ గాని నీకుఁ జము రే లబ్బున్? 10

క. అని పలుక మఱియు నడుగం, గని యచ్చట నున్న వైశ్యకన్య యొకతె యా
తనిఁ జేరి కలదు నూనియ, కొనియెదవే రమ్ము ప్రాలకును సరిలెక్కన్. 11

వ. అని పలికి చేరవచ్చిన మూట దింపించి బియ్యము లెస్సయవిగాఁ జూచి వానితో
మఱియు ని ట్లనియె. 12

క. ప్రా లొక్కటఁ గొని దానన, తైలము దిగువాఱఁ బోయుదానను నీకుం
బోలినఁ బ్రాలం గొలువుము, చాలము నీతోడఁ బిదప జగడము లాడన్. 13

వ. అనుపల్కులకు వాఁ డొడంబడుటయు. 14

గీ. పళ్ళెరంబుఁ దెచ్చి పటుబుద్ధి బియ్యంబు, దాని నిండఁ గొని ముదంబుతోడ
నంద వోసెఁ దైల మంచులు దిగువాఱ, నవ్విధంబు మెచ్చు నావహింప. 15

క. చని కాంచనగుప్తునకున్, వినిపించిరి యతనివారు వేగమ యతఁ డం
దునఁ దద్బుద్ధివిశేషము, గొనియాడుచు దానిఁ దనకుఁ గోడలిఁ జేసెన్. 16

వ. కావున మతి గలవారు లోకమున లే కుందురే యని సోమదత్తుం డా సచి
వోత్తముతోడ మఱియు ని ట్లనియె. 17

క. మతి గలిగియుఁ దాత్కాలిక, మతి గలుగక యుండెనేఁ బ్రమాదము వచ్చున్
మతిమద్వర! తాత్కాలిక, మతిఁ గాదే దక్షుఁ డొక ప్రమాదముఁ గడచెన్.

వ. అక్కథ యె ట్లనిన. 19

క. తురికాపురమున నొక భూ, సురతిలకుఁడు దక్షుఁ డనఁగ సులభవివేక
స్ఫురణుం డయ్యును దోషా, కర మగుయౌవనముచేతఁ గాముకుఁ డయ్యెన్.

క. అతని పొరుగింటియంగన, యతిశయసౌందర్య దానియధిపతి శస్త్రా
న్వితుఁ డుగ్రుం డ ట్లైనను, ధృతి దానిం జెఱుపఁ గోర్కి తీఁగలు సాఁగన్.

క. ఆ వాలుఁగంటి యొంటిగ, నేవల మెలఁగినను మ్రొక్కు ని ట్లాధూర్తుం
డావిప్రుచేఁత యితరుల, చే విని యక్కాంతమగఁడు చిత్తము గలఁగన్. 22

చ. అరసెదఁ గాక యివ్వడుగునాగడ మంచు వసించె నంగనాం
తరమున గోడమాటు వడి దక్షుఁ డెఱుంగక యుండె వాని సుం
దరి పనివెంట నద్దెసకుఁ దాఁ జనుదేర నిజేచ్ఛ నాత్మమం
దిరమున నుండి యావెలఁదిదిక్కునకుం జని యంత దక్షుఁడున్. 23

ఉ. ఎప్పటియట్ల యింతిఁ గని యేడ్తెఱ మ్రొక్కిన దానివల్లభుం
డప్పుడ దిగ్గన న్నెగసి యచ్చటఁ దోఁచిన వాఁడు దిట్టఁ డై
తప్పక యన్నిదిక్కులకుఁ దా వెడ మ్రొక్కి ప్రదక్షిణంబుతోఁ
జప్పుడు గా జపించుచును జండమరీచికి మ్రొక్కెఁ బల్మఱున్. 24

క. అది జపముతోఁ డిగ్రెము క్కని, పొదలినకోపంబుఁ దొలఁగి పోయె భటుం డి
ట్టిది తాత్కాలికమతిసం, పద యాపద లైనచోటఁ బ్రజ్ఞానిలయా! 25

క. మతి లేనివాఁడు విద్యా
న్వితుఁ డయ్యును మేలు వడయ నేరఁడు విద్యా
న్వితుఁ డయ్యుఁ దొల్లి గార్గ్యుఁడు
హతుఁ డయ్యెం గాదె విమతి యై యొకపులిచేన్. 26

ఇది సోమదత్తుడు భాస్కరునితో చెప్పిన కథ

వ. అక్కథ యె ట్లనిన. 27

క. గార్గ్యుఁ డనువిప్రుఁ డొకరుఁడు
దుర్గారాధనముఁ బెక్కుదోసఁగులఁ బడుచున్
దుర్గాటవిలోఁ జేయ ని
ర్గళగతిఁ దన్నుఁ జూచి యా యంబికయున్. 28

క. వర మడుగు మనిన మ్రొక్కుచు, సరభస మగుకాంక్షతోడ సంజీవని ని
ర్భరకరుణ న్నా కొసఁగుము, పరమేశ్వరి యనినఁ గొన్ని పచ్చనియాకుల్. 29

చ. తలఁచినమాత్ర నాత్మకరతామరసంబున నున్నవాని ని
మ్ములఁ గృప సేసి వీని రసముం బయిపైఁ జిలికింపఁగా శవ
మ్ములకును బ్రాణముల్ గలిగి ముందటిరూపము వచ్చి తేజముం
బలమును జెంది పూర్వగుణభంగిఁ జరించుట కల్గు నెల్లెడన్. 30

క. ఎండవు తఱుఁగ వనుచు నిడి, చండిక పొడ గానరాక చనుటయు మదిలో
నిండినసంతసమున వి, ప్రుం డవి కొని యాత్మపురముత్రోవ నొకరుఁడున్.

చ. చను నెడ నిర్మనుష్య మగుచక్కటి నప్పెనుగాన నెండి పో
యిన యొకపుండరీకశవ మీరము వెల్పల నున్నఁ జేరఁగాఁ
జని తన కన్నయౌషధముశక్తి నిజంబుగఁ జూడ నెంచి చే
త నలఁపి యాకులం బసరు దానిపయిం బిడిచెం గుబుద్ధి యై. 32

చ. పిడిచిన నేమి చెప్ప నతిభీకరదుస్సహపుండరీక మ
ప్పుడ తన నిద్ర మేల్కనినపోలిక మ్రోఁగుచు బిట్టు లేచి య
వ్వెడఁ గగువిప్రుఁ గూ యిడఁగఁ జేసి మృతుం బొనరించి మ్రింగె మే
ల్వడనియు బుద్ధి చాలనియభాగ్యులు తత్ఫల మంద నేర్తురే? 33

క. మతియ కళాకృషిబీజము
మతియ తనఫలప్రదక్షమాజము తలఁపన్
మతియ చెలి మతియ చుట్టము
మతిహీనులు చూడ మొఱడుమ్రాఁకులు ధాత్రిన్. 34

వ. అని పలికి తన్మతిం బ్రశంసించి తత్ప్రసంగం బట్లుండ నిచ్చి తమరాజువర్త
నంబుఁ దడవి చేయవలసినకార్యంబు సేయం దలంచి సోమదత్తుండు [illegible]
లున కిట్లనియె.

క. ఏ రసమున కెవ్వఁడు ప్రియుఁ, డా రసమునయందుఁ దేల్చి యభినవరచనావి
స్తారము పుట్టించిన మును, జేరినదెస విడిచి మనము సేరు నవలకు[illegible]

క. మాటలు పెక్కేటికి మద, నాటోపము భూమిపతికి నతిశయము గమె
ల్జోటిఁ గనఁబఱచి మన సా, రాటపడం జేసి కాని రా దుడిగింపన్. 37

క. కావున మన మిటకు మృగాం, కావలిఁ గొనివచ్చి చూపి యధిపుమనంబున్
దేవివలన నూటాడం, గా వేగమ చేయ వలయు గాఢవివేకా ! 38

వ. అటమీఁద నక్కన్య వరించి మనరాజు సార్వభౌమత్వముఁ జెందు నీ
యుపాయంబు మనకు నపాయవిమోచనంబును శ్రేయస్కరంబు నగుట దీనిం
గడవం గార్యం బొండు గలదే యక్కన్యకారత్నంబు రప్పింప మనకు నిది
సమయం బది యెట్లనిన నా రాజు రత్నసుందరి పినతల్లి భర్త యగుట
బాంధవంబు దోఁప సహాయులం దగువారిఁ గొందఱం బుచ్చి పరిఘబాహు
తోడ యుద్ధం బొనర్చునాఁడు నీ పుత్రుం డగుమృగాంకవర్మ యట నుండ
వలవ దిటఁ బుత్తెంచునది యని దేవిపేరిలేఖ పుత్తెంచిన నతండును సంతసిల్లుచు
నిచటికిఁ బుత్తెంచు మన మతనికిఁ బ్రియంబుఁ జేసినవారమపోలె మన
కార్యంబు నిర్వర్తించుకొంద మిది యట్టిద. 39

క. నయవంతులు నిజకార్య, ప్రయోజనములకును జేయుపను లన్యులు మా
కయి సేసిరి వీ రనుచుం, బ్రియ మందఁగఁ జేయుదురు భరితకౌశలులై. 40

క. ఇతరులు తనవలనఁ బ్రేమో, దితులై యుండంగఁ దాను దిట్టతనముతో
మతిఁ దన కార్యము నడపిన, చతురికకథ వినవె యిట్టిచందము దెలియన్.

సీ. విదిశాపురంబున వికచాంబుజానన
చతురిక యనునది చాల వాసి
గలవారకామిని గల దోర్తు దాని క
న్నగర మేలెడురాజు నగరి బచ్చు
కొడు కర్పాలనాఖ్యుఁడు మంత్రిపుత్రుండు
బహుతంత్రుఁ డనుపేరఁ బరఁగువాఁడు
తలవరి యగు దండధారుండుఁ బాతాళ
ఖనికాభిధానంబు గలుగునట్టి

గీ. చోరుఁ డొకరుఁడు చాఱుఁగు లై భూరిధనము
లూసఁగ సిరి గల్గి నలువురయుల్లములను
దాను దక్కంగఁ గొని వారు తమక తమక
కూర్పు నన నత్తలోదరి నేర్చి మెలఁగు. 42

శా. ఆరామాతిలకంబుకూరిమిసఖుం డై యుండు నవ్వీటిలో
నారీనాయకసంధివిగ్రహవిధానప్రౌఢసాచివ్యసం
చారైకప్రవణుం డధిష్ఠితమహాసాధుత్వవేషుండు మం
దారాఖ్యుం డగువిప్రుఁ డొక్కరుఁడు మేధాభూషణుం డెల్లెడన్. 43

క. ఆతఁ డా చతురిక విటజన, చతుష్టయముఁ గూడఁ దనవశం బగుగతి స
న్మతిఁ జేసి వారి కిష్టా, ప్తతఁ గైకొనువాఁడుఁ బోలెఁ దా వర్తించున్. 44

వ. ఇట్లు వర్తించుచు నమ్మందారుం డొక్కనాఁ డర్థపాలనాఖ్య మందిరంబునకుం బోయి యేకాంతంబున నిష్టాలాపగోష్ఠి నడపుసమయంబున. 45

క. అతనికిఁ బరమాప్తుం డై, చతురిక నీవలని కూర్మి చాల గలుగఁ జే
సితి వట నిజమా యనవుడు, నతిశయరాగాంధబుద్ధి యై వాఁ డనియెన్. 46

ఉ. ఎన్నఁడుఁ జేర నీ దొరల నేఁ జనుదెంచినఁ బ్రీతితోడ న
త్యున్నత మైనమచ్చపయి నుంచుమహోజ్జ్వలరత్నభూషలన్
ము న్నొకనాఁడుఁ దాల్పనివి మోదముతో ధరియించి వచ్చు నా
యున్నెడ కింతి నావలని మాననిప్రేమముఁ జెప్ప నేటికిన్? 47

వ. అనుటయు నవ్వచనంబులు విని మంత్రిపుత్రుం డగుబహుతంత్రుం డున్నయెడకుం జని యర్థపాలకు నడిగినట్లు యడిగిన నతం డమ్మందారుతో నిట్లనియె. 48

శా. పాడున్ వీనుల కింపు గాఁగ ననుఁ దాఁ బాడించు జూదంబు నా
తోడన్ వేడుక నాడు నూతనకథాస్తోమంబు నాచే వినున్
గ్రీడాపుష్పవిభూషణప్రకర మర్థిన్ నన్నుఁ జేయించు నా
కై దక్కున్ గమలాక్షి యేమిటికిఁ బె క్కాలాపముల్ నెచ్చెలీ! 49

వ. నావుడు మందారుండును నచ్చోటుఁ గదలి యింకొకసమయంబున దండధారునింటికిం బోయి వాని నట్ల యడిగిన నతం డి ట్లనియె. 50

క. పొరుగింటికి వచ్చు నితాం, బురుహేక్షణ యేను జెప్పి పుచ్చినయపు డె
వ్వరు గాని పిలువఁ గా వత్తురె యింటికిఁ జెపుమ వారతోయజనేత్రల్. 51

వ. అని పలికిన విని యట్ల యింకొకనాఁడు పాతాళఖనికు నడిగినం బొంగుచు వాఁ డమ్మందారునితో ని ట్లనియె. 52

 [illegible] 17 [illegible]

క. ఏ నిద్రఁ జెందునంతకుఁ, దా నొల్లదు నిద్ర దాల్పఁ దా నప్పుడు నా
మేను తనమేనితోడం, జేనికొనుం దెలివ కూర్మి పెం పే లదుగన్. 53

వ. అనిన విని యందఱి మనంబులం గలసంతసంబులు నెఱింగి తనలో నవ్వుచు మందారకుం డొక్కనాఁడు రహస్యస్థానంబునఁ జతురికతోడ నిరర్గళక్రీడాలాపగోష్ఠి నడపుసమయంబున నిట్లనియె.

క. నా కొక సందేహము గల, దోకోమలి! నిన్నుఁ బొంది యుండెడివిటు ల
స్తోకవివేకులు నలువురు, నీ కెవ్వరియందు వలపు నిక్కము చెపుమా. 55

క. అనుటయుఁ జతురిక నీ వెఱుఁ, గనివాఁడవ పోలె నడుగఁగాఁ దగ దం దె
వ్వనిఁ గాని యేల తగులుదు, ధనముకొఱ కొనర్తుఁ గాక దట్టపుఁబ్రియముల్. 57

వ. అని మఱియు నిట్లనియె.

సీ. మిన్నక యొకనిపైఁ గన్నులు వొలయించి
యరగంట నొకని నెయ్యమునఁ జూచి
చెన్నార నొకనిపైఁ జిఱునవ్వు చిలికించి
యలరుచు నొకనిపైఁ బలుకు వైచి
యొకని నీ విట రాక యోర్వ ర మ్మని పుచ్చి
యొకనిఁ గూటంబున నోరఁ జేర్చి
యొకనికిఁ గూరిమి ప్రకటించి నమ్మించి
పాటించి యొకనికి బాస చేసి

గీ. తన్నుఁ దా రందఱును జాలఁ దగిలి యిచ్చఁ
దమక తక్కినయది యని తలఁచుకొనఁగ
నెవ్వరికిఁ దాను గూర్పక యెల్లభంగి
ధనమునక కూర్చునది వారవనిత యనఁగ. 58

వ. అనుటయు నమ్మందారుం డర్థపాలనున కెట్లు కూర్ప వని యతండు సాను
రాగుం డై తనకుం జెప్పినపలుకులుం జెప్పినఁ జతురిక యతనిఁ జేసఱచి
నవ్వుచు నిట్లనియె.

క. మ చ్చెక్కింపుదు వానిని
నిచ్చెన యిడి తొలఁగఁ బుచ్చి నెమ్మదితో నే
ద్రుచ్చిలి క్రిందటియిండ్లన్
విచ్చలవిడిఁ బిలుచుకొఱకు విటుల నితరులన్. 60

వారవనితల
మనస్తత్వం మీద
కవిగారి రచన
[illegible]
[illegible]
చెబుతున్న కథలు
మందారుని
[illegible]

గీ. వాని పిలుపునాఁడు వరరత్నభూషణ
వ్రజముఁ బూను టెల్ల వాఁడు రత్న
శుద్ధి యెఱిఁగి యెఱుఁగు సౌవర్ణికపటంబు
గాన వానిఁ దాల్తు వానియొద్ద. 61
క. అనుటయు నది కపటం బై, నను నయ్యెం గాక మంత్రినందనుతో నీ
వనురాగవిహారంబున, నెనయుట యది కూర్చు నందు లే యబ్జాక్షీ! 62
వ. అని యతఁడు చెప్పినపలుకులు సెప్పిన విని చతురిక యి ట్లనియె. 63
గీ. వాఁడు ప్రౌఢ గాన వానిచే మెల్లనఁ, గళల నేర్తు నాకుఁ గళల నేర్పు
గలుగ వానితోడఁ గవయు నొల్లక ప్రొద్దు, జరపుటకును నిదియ వెరవు గాన.
క. అనుటయు నది యగుఁ బో నీ, వనురాగాధీన వై పరాలయమునకుం
జనుటయుఁ గూర్పనివిధమే, యని చెప్పెను దండధారునాలాపంబుల్.
వ. చతురిక యి ట్లనియె. 66
ఉ. చోరుఁ డొకండు నావిటుఁడు నూడవె యచ్చట వాని మిత్రులన్
జోరకుసాధనంబులను జూచినయప్పుడు దండధారుచే
దారుణదండపాత మగుఁ దథ్యము గావున వాని మద్గృహ
ద్వారముఁ జూఱ నీక తలవాకిటి యిండ్లక వోదు సెప్పెడున్. 67
క. బలవంతుఁ డైనఖిండఁడు, నిలయములో నున్నవాఁడు నినుఁ గూడక యే
నిలువంగఁ జాల నని చని, పలుమఱుఁ బొరుగిండ్ల వానిపచనముఁ దీర్తున్.
వ. అనిన నది కార్యార్థకృత్యం బైనను నయ్యెం గాక యిది నిక్కంబు
సెయ్యంబు గాదే యని పాతాళఖనికుపలుకులు వినిపించిన నవ్వుచు నమ్మం
దారుతోఁ జతురిక యి ట్లనియె. 69
ఉ. వానికి ముందుగా నిదుర వావిరిఁ బొందను వాఁడు దొంగ కాఁ
డే నిలయంబులోని ధన మెల్లను దొంగిలకుండ మేనితో
మేను పెనం బిగింతు మును మెల్లన వాఁడు సరింపకుండ మే
ల్కాన నుపాయ మొండొకఁడు గల్గునె నా కిది గాక చెప్పుమా. 70
వ. అనుటయు మందారుం డివి యన్నియు ని ట్లగుం గాక వారాంగనలయందుఁ
గూరిమి యెవ్వరియందు లేదే యనినఁ జతురిక యి ట్లనియె. 71
క. కూరిమి లే దని పలుకుట
నేరమ యెవ్వారి కైన నెయ్య మొకదెసన్
జేరక తక్కదు కపటపుఁ
గూరిమిఁ దఱ చడఁగి యుండుఁ గూరిమి యొకచోన్. 72

క. కలవని వలవని ప్రియు నెడఁ, గలిగించుకొనంగ వెఱవు గలిగిన నటులం
గలిగినసెయ్యము ప్రియులకు, జెలి దోఁపఁగ నీరు నూవె వెలఁదులు తాల్మిన్.

క. తనకొఱకై యాచతురిక, యొనరించినపనులు కూర్మియుపచారము లై
కొని యర్థపాలనాదుల, మనములు హరియించె నేర్పుమతిఁ దెలిసితివే. 74

క. కావున మనమును మనకొఱ, కై వేగమ చండవర్మ కతిమిత్రుల మై
యావిభునికూఁతు నిచటికిఁ, దేవలయుం గార్య మిదియ ధీమత్ప్రవరా! 75

క. అని యిట్లు తనకు నల్లుఁడు, వినిపించిననీతివాక్యవివరణ మెదఁ జే
కొని భాగురాయణుండును, బనిచెఁ దోడ్తెర లాటపతికూర్మిసుతన్. 76

సీ. వారఁ డట్లు చని వేగ వావిరిఁ దోడ్తెర నక్కుమారికఁ దనయాలయమున
విడియించుకొని లాటవిభుఁడు పుత్తెంచుడు నాయనసుతుఁడు మృగాంకవర్మ
చనుదెంచినాఁడు మీ యనుజుండు గావున వేఱొకతావున విడియ టనుచి
తం బని మానివాసంబున విడియించు కొన్నార మని దేవి కన్నతప్ర.

గీ. మదము గాఁ జెప్పి పుచ్చి యమ్మంత్రివరుఁడు
దేవిపరిచారికలలోన దృఢవివేక
యగుకళావతి నాత్మకార్యానుకూల
భారధూర్వహఁ గాఁ బొందుపడ ఘటించె. 77

వ. ఆమృగాంకావళివిధం బెఱింగించి యక్కన్నియకుం జెలియ లై వ రిల్లునట్లుగా
బహుమానపూర్వకంబుగా నిలిపిన న ట్లక్కార్యంబు సమాధానం బగుటయు.

ఉ. అంతటిలోన నొక్కనుత మాత్మఁ దలంచి యపూర్వశిల్పధీ
మంతులఁ జేయఁ బంపె నసమానముగా నొక హర్మ్యరత్న ము
భ్యంతరమందిరంబునకు నావల దవ్వుల భాగురాయణుం
డెంతయుఁ గ్రొత్తలాగుగ మహీతలభర్తకుఁ బవ్వళింపఁగన్. 79

వ. అది సుషిరకుడ్యస్తంభయంత్రం బగుగృహం బవ్విధంబు రాజు మొదలగు
వా రెవ్వ రెఱుంగ రక్కాలంబున కాయతం బైనజగతీనాథుం డభిన
వంబును మనోహరంబును నగుట నంద నిద్రించుచుండు నంత నొక్కనాఁడు.

గీ. రాజ్ఞి దాదికిఁ బుత్రియుఁ బ్రాణసమయు, నైనమేఖల యనుదాని యడ్డు లేక
రాజు నెచ్చెలి యైనచారాయణాఖ్య, విప్రుతోఁ గలహించినవిధ మెఱింగి.

క. మకరందికయును సుమతియు, సుకుమారిక యనఁగ రత్నసుందరిపరిచా
రికలు నగరిలో ముప్వురు, నొకచో నేకాంతగోష్ఠి నుండుచుఁ దమలోన్. 82

వ. చారాయణమేఖలావివాదప్రసంగంబు లగుమాట లాడుచుండ నందు సుమతి
యి ట్లనియె. 83

క. మొగమోట గరిమ మడఁకువ, తగ వుచితము మెలపు పెంపు తాలిమి యివి లో
నగుసుగుణంబులు వలవదె, నగళ్ళలోఁ దిరుగుపరిజనంబుల కెల్లన్. 84

క. పోరఁ దొడంగిరి కంటిరె, చారాయణమేఖలలు విచారింపరు ధా
త్రీరమణు నెదుటఁ బడినను, నేరక యిటుఁ గినుక పుట్టునే యిరువురకున్.

క. నైజగుణంబునఁ దమమది, రాజస మప్పటికిఁ గప్పి ప్రజతో నాయా
యోజఁ జరించినయంతనె, రాజులు సాధు లని నమ్మ రా దెవ్వరికిన్. 86

క. చలమున సన్నపుఁగార్యం, బులకై తమలోనఁ బ్రజలు పోరినఁ బతి యు
త్తలుఁ డైనఁ జెడరె వాదం, బుల శశముఁ గపింజలంబుఁ బొలిసినభంగిన్.

వ. అక్కథ యె ట్లనిన. 88

క. నర్మదతటమున హింసా, కర్మం బొరు లెఱుఁగకుండఁ గాఁపుర ముండున్
ధర్మమునఁ జరించుకపట, ధార్మిక మొక్కపులి యొక్కతరుకుంజమునన్.

వ. ఇట్లు వర్తింపుచుండ నొక్కనాఁ డవ్వనంబున మృగంబు లెల్లఁ బెద్దయు
నమ్మి తమ్ముఁ బరిపాలించుట వేఁడిన నదియును హింసాధర్మంబున దండనం
బొనరింపం గాని న్యాయాన్యాయంబులు నిర్ణయించి మిమ్ముఁ దగుభంగి
శిక్షింపఁ గలవాఁడ ననియె నవ్విధం బట్లు చెల్లుచుండ నొక్కనాఁడు. 90

క. ఒక్కయెడం దమలో నొక
బొక్కకు వా దడిచి శశకముఁ గపింజలముం
గ్రక్కునఁ బఱతెంచి పులికి
మ్రొక్కుచు నిజవాద మిరువురుం జెప్పుటయున్. 91

వ. ఆవ్యాఘ్రంబును వానితోడ. 92

గీ. ముదిసినారము కానము మున్నవోలె
శ్రవణములు దూరమును విను శక్తి లేదు
కదియఁ జనుదెంచి చెప్పుఁడు కార్య మనుడు
నవియుఁ దేకువ మాలి డాయంగ నడవ. 93

క. ముందటికాళ్ళం గొని యా, కుందేలుం గైదుఁ బట్టికొని గొంతుక నం
దందఁ గఱచి భక్షించి య, మందప్రీతిఁ బులి శౌర్యమత యై యుండెన్. 94

క. అలఁతు లగుకార్యములు ఘన, ములు సేసి చలంబుపేర్మిఁ బోరఁగ నది రా
జుల చెవులఁ బడ్డ నిరుదెఱఁ, గులవారికిఁ జాలఁ గీ డగుట సందియమే? 95

వ. అని యిట్లు సుమతి యెఱింగించినకథ విని మకరందిక యి ట్లనియె. 96

క. పోరొప్ప డెందు నల్పులు, పోరిన నది బలసి యంతఁ బోవక విపదా
ధార మగుఁ దొల్లి తొండలు, పోరిన జనులకును బాధ పుట్టినభంగిన్. 97

వ. అక్కథ యె ట్లనిన. 98

సీ. మాణిక్యసేననామకుఁ డొక భూపతి జైనులయెడ భక్తి చాలఁ గలిగి
యడవికిఁ జేరువ యగుచో నగాధసలిల మగు నొక తమ్మికొలనిపొంత
వారికి వసతులు గోరినట్లన సమీచీనంబులుగ నొప్పఁ జేయఁ బనిచి
సకలపదార్థసంచయములు నటఁ బుచ్చి యందు వా రుండెడునట్లు చేసి
గీ. తమ యనుష్ఠానవిధి కది తగిన యేక, తంపు సెలవు మనోహరస్థలము గాఁగ
వారు నిజదర్శనోచితవర్తనముల, నుల్లములు సమ్ముదముఁ జెంద నుండునంత. 99

మ. ఒకనాఁ డచ్చటి నీరజాతవనతీరోపాంతకుంజంబునం
దొకచోఁ దొండలు కాటులాడుటయు నం దొక్కండు విక్రాంతి కో
ర్వక యొక్కం డది వెంట రాఁ బఱచి యేవంకం జొరం జోటు గా
నక కాంతారమదేభ మా కొలనిలోనం జొచ్చి క్రీడింపుచున్. 100

క. తిరుగాడుచుండఁ గాఁ గని, కరము భయభ్రాంత మగుచుఁ గరివరకర్ణాం
తరవివరములోనికి నొక, తొరటముగతి సరట మంత దురదురఁ దూఱెన్. 101

మ. అది చూత్కారముఁ జేసి కే ల్విద్రుచుకొం చంభోజషండంబు ను
న్మదభంగిం బలు మ్రోఁతతో వెడలి పల్మాఱున్ మహాఘీంకృతుల్
సెదరన్ వెండియుఁ దొండమున్ విద్రుచుచున్ శీఘ్రంబ పెక్కాఁకులుం
బొదలుం గూల్చుచుఁ బాఱి జైననిలయంబుల్ సొచ్చె నుగ్రాకృతిన్. 102

ఉ. కొమ్మల నూఁది కుడ్యములఁ గూలఁగఁ ద్రోచియుఁ గేల వీటతా
టమ్మల నీవలావలఁ బడన్ సదనంబులు వైచియున్ మహో
గ్రమ్ముగ డాసి యున్నకరిఁ గన్గొని గుండెలు జల్లనంగ వ
స్త్రమ్ములుఁ గుంచియల్ విడిచి తల్లడ మెక్కుడు గా వడంకుచున్. 103

ఉ. ఒండొరుఁ దాఁకి జైనమునియూథము కుత్తుకదాఁక వట్టి నో
ళ్ళెండఁగఁ గాళ్ళఁ దొట్రువడ నేచెసఁ బాఱఁగ లేక కూయ వే
దండము సేరి కొమ్ములఁ బదంబులఁ దొండమునన్ వధించినం
దండము లయ్యెఁ బీనుఁగులు ధారుణిఁ గాలువ లయ్యె నెత్తురుల్. 104

గీ. అట్లు జైనుల వధియించి యచటఁ గడమ, వడినవసతులు వడఁద్రోచి వారణంబు
కొలను సొచ్చి సరోరుహకులము నెల్ల, మరల భగ్నముఁ గావించి దరికి వచ్చి.

క. సరసీజలముల నిండం, గరమునఁ బూరించి యోరఁగాఁ బడి చెవిలో
గురిపించినఁ దల్లడపడి, సరటము పైఁ బడెఁ గరియు సమ్మద మందెన్. 106

గీ. అల్పు లొనరించుదుష్కలహంబుఁ గూడఁ
జేరు వై యున్నఘనులకుఁ జేటుఁ దెచ్చు
సరటకలహంబు చేరు వై సమసినట్టి
వారణము లై నకులముఁ గాసారమట్లు. 107

వ. అని మకరందిక యెఱింగించినఁ గడుఁ గొనియాడి సుకుమారిక యి ట్లనియె.

క. అలుకయు మదమును గర్వము, నొలుకు నకారణవిరోధ మొందు జనులచె
య్యుల కెక్కు డైనయాపద, మొలచును మధుబిందుకలహముల చందమునన్.

క. ధరణిపయి లాటనరపతి, పురిఁ దేనియ నమ్ముకొఱకు బోయలపల్లెం
జరియించుచుండువాఁ డొక, పురుషుం డది యొక్కకలశమునఁ గొని కడఁకన్.

వ. అరిగి యానగరంబున నొకసన్నపువీథియందు. 111

ఉ. తేనియకుండ మోఁచికొని దిక్కులు నాలుగు బిక్కచూడ్కి నే
దేనియుఁ జూచుకొంచు నొకయేనిక కట్టెదుటన్ మదాంధ మై
రా నచటం దొలంగెడుపురంబుజనంబును జూచి భీతుఁ డై
దానిను నుత్తరించుచుఁ బదంబులు తొట్రుపడంగఁ బాఱుచున్. 112

గీ. వడఁకుఁ గొని నిలువఁ ద్రొక్కనియడుగు కొంత
జాఱి మ్రొగ్గతిలంబడఁ బాఱుటయును
నిండి మూఁపునఁ దాల్చినకుండ తొలఁకి
యొలికె మధుబిందు వొకకొంత యుర్విమీఁద. 113

సీ. ఆ తేనెబొట్టున కచట నీఁగలు ముసిరిన వానిఁ బట్టంగ నని కడంకఁ
జేరె నచ్చటి కొక్కచెలఁది యాచెలఁది మ్రింగినబల్లి నొకపిల్లి దినియె నంత
నాపిల్లిఁ గఱచె రాజాధీన మగువేఁటకుక్క యొక్కటి దానిఁ గోప మడరఁ
బొడిచె బిడాలంబు నొడయనినగరికుక్కలవారు చంపిరి కడఁగి దాని

గీ. దానివాడవారు తవిలి చంపించిరి, కుక్క నంతఁ గినిసి కుక్కవేఁట
కాండ్రు రంద ఱేఁగి కత సవిస్తారంబు, నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి.

మ. తగ వూహింపక యూరివాడప్రజలం దాఁ జంపఁగాఁ బంచినన్
జగతీవల్లభుఁ డైన నేమి యని యుత్సాహించి సన్నద్ధు లై
నగరం గొల్వనివార లొక్కదెస యై నానాయుధోపేతు లై
తెగి భూపాలకసేనఁ దాఁకిరి మహోద్రేకంబుతో నార్చుచున్. 115

ఉ. రెండు తెఱంగుమూఁకలును రిత్తకు రిత్తచలంబుపెంపునన్
ఖండన ముగ్రభంగుల నొనర్పఁగఁ జెక్కులు ద్రెళ్ళఁ బీనుఁగుల్
కండలుఁ బ్రేవులుం గలసి కాలువలై యొసలారె నెత్తురుల్
కుండలచారుమస్తములు గుప్పలు గట్టెఁ బురంబువీథులన్. 116

వ. అట్లగుటంజేసి. 117

క. కడుసన్నపుఁగార్యము నై, కుడురోసముతోడఁ బెనఁగి కుమతులు మూర్ఖం
బుడుగక పెద్దయు నేగిం, బడుగుల చుమి లాటన్నపతిపౌరులువోలెన్. 118

వ. అని చారాయణమేఖలాకలహంబు లుగ్గడించి కలహంబు లింత లెస్స యగునే
యనుచు మువ్వురు నిజేచ్ఛం జని రంత నొక్కనాఁడు. 119

సీ. లలితవివేక కళావతి భాగురాయణుచేత నుపదిష్ట యగుచుఁ జెలిమిఁ
జారాయణునితోడ సంధించి మేఖలఁ బరిభవింపంగ నుపాయ మొకటి
యెఱిఁగించె వాఁడు నయ్యతివ చెప్పినయోజఁ గదిసి మేఖలతోడఁ గపటసఖ్య
మొనరించి పురుషుఁ డం చొకదాసితోడను బెండిలిఁ జేసినపిదప నెఱిఁగి

గీ. భంగపాటునుశిఖి యంతరంగ మెల్లఁ
గాల్పఁ జేల ముసుంగిడి కదిసి రాజ
యుక్త మగు దేవియడుగులయొద్ద వ్రాలి
పొగిలి యడలెనమ్మేఖల యెగిచి యెగిచి. 120

గీ. పెండ్లికిం బంపఁ దగు ననఁ బ్రియము మెఱయఁ
దగినవారిని బుచ్చితిఁ దలఁపు మిగిలి
నిన్నరాతిరి పెండిలి నేఁ డిదేమి
వచ్చె దీనికి నని దేవి వగచుచుండ. 121

క. భూరమణుఁడు సన్నపునగ, వారుమొగముతోడఁ దన్ను నల్లనఁ జూడన్
బూరితసంతోషుం డై, చారాయణనాముఁ డధికసంభ్రముఁ డగుచున్. 122

గీ. జోటి! పోయినరేయిని శోభనంబు
వచ్చి పెండిలి యాడితి విచ్చ మెచ్చి
నిన్నుఁ గట్టిన నీత్రాడు నేలఁ బోరల
నిచటఁ బొరలంగఁ గారణ మేమొ చెపుమ. 123

క. పరిణయసంధానమునకు, దొరయుటఁ జారాయణుండు దొర యని నరునిన్
వరుఁ జేసెఁ బెండ్లి యేమిట, సరి గాఁడో నీమగండు చామా! నీకున్. 124

క. అని పలికి పెలుచ నవ్విన, జననాయకమహిషి యాత్మసఖితో నడలం
బని యేమి చెప్ప చయ్యన, ననవుడు నే డ్పుడిగి లేచి యవనతముఖి యై. 125

వ. చారాయణుండును తనతోడం గపటసఖ్యం బొనరించి తన్నుం దనబంధుజనం
బుల సమ్ముఖమ్మున నుత్సవదర్శనకుతూహలంబున వచ్చినవారియెదుర సరివారి
ముందఱం బరిభవించిన తెఱంగు నీరెలుంగుతో వెక్కుచుం జెప్పి క్రమ్మఱం
గన్నీరు మొగంబున నించుచుండె. 126

ఉ. అప్పుడు దేవి భంగము వయస్యకుఁ జేసినరాజుమిత్రుపైఁ
దప్పు ధరాతలేశ్వరునితప్పుగఁ జూచి దరస్మితంబుతో
నొప్పెడుమోముఁ జేఁ దుడిచి యోరగఁ జేసి యపాంగభాగముల్
ఱెప్పలఁ గప్పినం బుడమిఱేఁడు వడంకె మనంబులోపలన్. 127

చ. వినయవివేకభూషణుఁ బవిత్రమహీసురవంశపోషణుం
గనకనగేంద్రధైర్యు నవికారనిరూఢగుణాభిధుర్యు స
జ్జనసతతోపకారహరిచందను బాంధవచిత్తరంజనున్
మనుజశరీరదృష్టశతమన్యుని సర్వనరేంద్రమాన్యునిన్. 128

క. సుశ్రేయఃప్రారంభు జ, నశ్రుతపౌరుషుని భావనారాయణదే
వశ్రీపాదసరోజా, తాశ్రయనిజచిత్తషట్పదాన్వయు సుమతిన్. 129

మాలిని. కవిజననుతకీర్తిం గామినీకామమూర్తిం
బ్రవిమలగుణహారుం బ్రాజ్ఞచేతోవిహారున్
వివిధసుకృతయోగిన్ విష్ణుభక్తానురాగిన్
భువనహితచరిత్రుఁ బోలమాంబాసుపుత్రున్. 130

గద్య—ఇది సకలసుకవిజనవిధేయ మంచననామధేయప్రణీతం బైన కేయూరబా
హుచరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు

# కేయూరబాహుచరిత్రము

## తృతీయాశ్వాసము



క. శ్రీరమణీకారుణ్యాసు, ధారసరసీమరాలుఁ దారకవాణీ
శారదనీరదనారద, హారనిభయశస్క గుండనామాత్య [illegible]

వ. కేయూరబాహుమహానాథుం గటాక్షించి దృష్టి మరలఁ దిగి [illegible]

చ. తొలఁగుము వంత నీ విది విదూషకమంత్రముచేత గాదు మా
కెలుఁగఁగ వచ్చె నెల్లవియు నేటికి మాటలు వేయు నేర్చుఁ గ్రొ
మ్మెలుఁగులు గ్రమ్ము కేలఁ గొని మేఖలబాహువు నూఁది [illegible]
బిలుఁదును నల్లనల్లనఁ దపింప మృగేక్షణ వోయె నల్కతోన్. 3

వ. ఇట్లు దేవి నిజనివాసంబున కరుగఁ దత్పరిచారిక లగుసుమతీసుకుమారికామక
రందిక లోకచోటికిం గూడి రహస్యగోష్ఠి యొనరించునవసరంబున సుమతి
యి ట్లనియె. శాపసరిచారిక సుమతి మాట 4

క. చెలులార! కంటిరే మే, ఖలబేలతనంబు మున్నుఁ గానక పగతో
బలియింప నేల నెయ్యము, సలుపంగా నేల పిదపఁ జారాయణుతోన్. 5

క. ద్రోహోక్తుల వైరానల, మూహింపక రాఁజవెట్టి యుక్తిరహితు లై
స్నేహంబు పిదపఁ జనునె య, పోహంబుగ నుండుఁ గాక వొనుబా టగునే?

క. బలవంతుఁడుఁ బగవాఁడును, ఖలుఁ డనఁగాఁ జాలువాఁడుఁ గపటోక్తులఁ దాఁ
గలయఁగ వచ్చిన బేల్పడి, కలపికొనిర యేనిఁ గీడు కాకుండ దిలన్. 7

క. నేరుపు మై మేఖలయెడఁ, జారాయణుచేత తొల్లి సర్పము గపటా
ధారోక్తుల దర్దరములఁ, జేరి పిదప వాని కెగ్గు సేయుట వోలెన్. 8

వ. అనుటయు నది యె ట్లన నహిభేకోపాఖ్యానంబు సవిస్తరంబుగా వినిపించెద
వినుం డని సఖులతో ని ట్లనియె. 9

ఉ. పూచినతీఁగెలన్ మధురభూరిఫలంబుల వ్రేఁగునన్ మహిన్
మోచినకొమ్మలుం గలిగి మూఁకలు గట్టినపోఁక మోకలన్

రాచినవాల్మ్రుగంబుల ఘనంబుగ వర్ణన సేయ నొప్పు విం
ధ్యాచలపార్శ్వకానన మనన్యవనీవిభవోపమాన మై. 10

వ. అ ట్లయ్యరణ్యం బభిరామగమ్యం బై పరఁగునంత. 11

క. తొల్లి యుగసంధి నొకతఱి, నెల్లెడఁ బొడ వడఁగఁ దాప మెక్కుడుగా సం
ధిల్లె నొకవఱపు ప్రాణులు, తల్లడిలఁగ నిడివి యగుచు ధరణి తలంకన్. 12

వ. అక్కాలంబున. 13

సీ. పసిమి యెచ్చట లేక పా డగుటకుఁ దోడు పాతాళమునదాఁకఁ బగిలె నేల
బిలములు వ్రయ్య లై నెలవులేమికిఁ దోడు హీనజంతువు లెల్ల నివిరె నెండఁ
జండాతపముచేత నెండిపోకకుఁ దోడు ద్రుమములఁ బెనుగాలి తుమురు సేసె
నాఁకలి నీరువ ట్టనుచిచ్చునకుఁ దోడు కార్చిచ్చు మృగములఁ గాల్పఁ దొడఁగె
గీ. నాపదలమీఁద నాపద లాకసిల్లె, వట్టిపోయినడొక్కలు వాము లయ్యె
నివుఱుబొగ్గులప్రోవులు నిఖిలదిశల, నధికదుస్సహ మయ్యె నయ్యడవియందు. 14

క. పరిపూర్ణోదక మై కడు, నిర వగునొకకూపమున న నేకంబులు ద
ర్దురములు బహువర్ణంబులు, పరఁగు సుహృద్భ్రాతృపుత్రపౌత్రయుతము లై. 15

వ. ఇ ట్లన్నియుం దమకు మహావేగుం డనునొకచక్కనిమండూకంబు రాజు గా
నిలుపుకొని సుఖం బుండునంత. 16

క. ప్రియబంధు లెల్లవారును, లయ మందినఁ దాను జాల లావఱి కంతా
శ్రయజీవన మై తిరిగెడు, భయదర్శిక మనఁగ నొప్పుపా మచ్చోటన్. 17

క. మండూకనినాదము విని, నిండినసంతసముతోడ నీ రుండనిచో
నుండ దివి యచట నుదకము, లుండఁగఁ బోలు నని మేన నుమ్మసలారన్. 18

మ. కదియం జయ్యన వచ్చి నాగ మచటం గాంభీర్యసంపత్తికిం
గుదు రై యుండెడునూయిఁ గాంచి మదిఁ గోర్కుల్ నేఁడు సేకూఱుఁ బో
వుదు నాతృష్ణ బుభుక్ష యిప్పుడ వెసం బుత్తు న్మహావగ్రహా
స్పదదుష్కాలదినంబు లెల్ల నిచటన్ సమ్యక్సుఖావాసి నై. 19

క. చొఱ వెడలఁ దెరువుఁ గానక, దరి నుండుచు లోన నుండుదర్దురనాథున్
బరిమితపరిజనపరివృతు, నిరవున నున్నతనిఁ జూచి యి ట్లని పలికెన్. 20

శా. దేవా! భేకకులాధినాథ! కరుణాదృష్టి న్ననుం జూడవే
జీవం బుండదు నీరువట్టుకతనన్ శీఘ్రంబ నిం గొల్వ రాఁ
ద్రో వేదిక్కునఁ గాన నేర మదిలో దుఃఖంబునం బ్రుంగెదన్
నీవారిం గలయంగ రాఁ బనిచి మన్నింపం గదే వేఁడెదన్. 21

క. మాపెద్ద లెఱుక సాలక, మీపెద్దల కెగ్గు సేసి మెలఁగుట యెల్లం
బాపికొన వలయు నను నీ, శ్రీపాదసమీప మిపుడు చేరిచికొనవే. 22

గీ. ఉరగసంఘంబులకుఁ గప్ప లోఁడు కెల్ల
నీవు పుట్టక మును గాని నీప్రతాప
మెఱిఁగి రిఁక మిమ్ము దొరయ రా వెఱవ కుంద్ర
చారుతరమూర్తి! మండూకచక్రవర్తి! 23

క. హనుమంతునిం బ్లవంగం, బని పిల్తురు నిన్నుఁ బిలుతు రాపేరనె యిం
ద్రుని హరి యందురు హరి యని, నినుఁ జెప్పుదు రనఁగ వినుతి నీకుం దగదే.

క. అని తన్ను నిట్లు వొగడిన, విని యెడ లుబ్బంగ భేకవిభుఁ డయ్యాహి కి
ట్లను నామంత్రులయనుమత, మున నిను రప్పింతు నిలువు ముదమున నచటన్.

చ. అని తన యిష్టమంత్రుల రయంబునఁ బిల్వఁగఁ బంచి వారి క
ప్పని యెఱిఁగించిన న్వశమె పాములపొత్తు మనంగ దీని నే
మని యొక గొప్పకార్యముక్రియం దలపోసెద వన్న వెండియుఞ్
మనమున సర్పబాంధవము మాననియేలికమోము సూచుచున్. 26

వ. స్వోతుం డనుదర్దురం బి ట్లనియె. 27

క. తనకు నెడ రైనతఱి మా, లనికం టెం గీడువడు నలజ్జత నది వా
సినయపుడ మఱచి కుజనుఁడు, దనుఁ బట్టపురాజు గాఁగఁ దలఁచు మనమునన్.

క. చెలిమి శిలాక్షర మెప్పుడు, నలుక జలాక్షరము సుజను లగువారలకుఞ్
జెలిమి జలాక్షర మెప్పుడు, నలుక శిలాక్షరము కుజను లగువారలకున్. 29

వ. పిదపఁ గృష్ణరూపం బనుమండూకం బి ట్లనియె. 30

మ. అరయం దుష్టజనుల్ స్వదుశ్చరణజాత్యంధుల్ నిజాచారధీ
గరిమాతిస్తుతిమంతు లాత్మఘనరక్షాజాగరూకాత్మకుల్
పరదోషేక్షణదివ్యచక్షు లితరప్రజ్ఞాప్రశంసానిరం
తరమౌనవ్రతు లన్యవిత్తహరణధ్యానక్రియానైపుణుల్. 31

క. చేరంగఁ దగనిదుర్జనుఁ, జేరంగా నిచ్చిరేని సేగియు నిఘమల్
కూరుదురు తొల్లి కాకము, సేరినయంచలకు నైనచేటు విన మొకో. 32

క. అనవుడు మండూకేశుఁడు, విన మెన్నఁడు నంచ లేమివిధమునఁ గాకం
బునకు నిర విచ్చె నెవ్విధ, మున వానిం బిదపఁ గీడు వొందెం జెపుమా. 33

వ. అనిన యాకథ విను మని యాకృష్ణరూపి యి ట్లనియె. 34

సీ. ఒకపర్వతముమీఁద నొప్పెడుకొలనిలో నంచలు కొన్ని యిచ్ఛానువృత్తిఁ
బగ లెల్ల విహరించి భానుఁడు గ్రుంకంగఁ బాపాత్ములకుఁ జేరఁ బ్రాఁక రాని
యున్నతోన్నత మగునొకగండశిలయందు రే లెల్ల సుఖలీలఁ గ్రాలుచుండు
న ట్లుండఁ దద్గ్రహణాపేక్ష నొకబోయ తెంకిప ట్టరసియుఁ దేఱి చూడ

గీ. లేక యరిగెను నొకనాఁడు కాక మొకటి
ప్రొద్దు గ్రుంకిన నచటుగాఁ బోయి పోయి
ఖగనినాదము విని వానిఁ గదియ వచ్చి
యుండుటయు దానిఁ గని హంసయూథ మెల్ల. 35

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి నేఁగెద వేమి ప్రయోజనార్థమై
యిచ్చట నిల్చి తీ వనిన నేఁటి దినం బని పక్షి నిండఁగాఁ
జెచ్చెర నుక్కుపట్టునకుఁ జేరఁగఁ బోయెడిప్రొద్దు లేమి నా
కిచ్చట నుండఁగా వలసె నిట్టిది నావిధ మంచుఁ జెప్పినన్. 36

క. అగుఁ గాక నిలువు మని హం
సగణం బంతయును బలుక సంకటపడుచున్
సుగుణుఁడు మతిమంతుం డను
తగ వెఱఁగినయంచ యొకటి దా ని ట్లనియెన్. 37

గీ. సబము నెంగిల్లు దీనిభోజనము క్రూర
మిట్టియొగ్గులు వేయును నేల చెప్ప
ఖగములందుఁ జండాలుఁడు కాక మనుట
కడుఁ బ్రసిద్ధంబు గాదె యానొడువు వినరె?

[illegible]
పక్షులకి కూడా కులం ఉంది
హంస బ్రాహ్మణ !!
కాకి మాల ఐతే !!

క. వల దీరే యిది మనకడ, నిలిచినఁ గీ డొందు మనల నేఁ డెల్లిటిలో
పలఁ జేరకున్నఁ గాలము, తల నైనను జేరు నింత తథ్యము సుండీ. 39

వ. అనుటయుఁ గార్యం బెఱుఁగనితరుణమరాళములు కొన్ని యమ్మతిమంతు
నుద్దేశించి.

ఎప్పుడూ [illegible]

గీ. ఇంత వద్దు వాద మీ కాకి యొక్కటి, యొక్క రాతి రిచట నున్నమాత్రఁ
గీడు సేరు ననుచుఁ గీనువగొట్టుట, యిద్ది వెఱపు గాక యెఱుక యగునె? 41

క. పెక్కులు బుద్ధులు గఱచిన, నెక్కుడు భయ మనుట నిక్క మింక బహూక్తుల్
తక్కు మిదియుఁ గా కిది తా, నెక్కడికిం బోవుఁ దిమిర మిప్పుడు రాఁగాన్.

క. అని పలికి దాని నుండం, బనిచి యభీష్టంబు లైనఫలములచే భో
జన మొనరింపఁగ నుండఁగఁ, దనయిమ్ముల వాయసంబు దగ నివసించెన్. 43

వ. ఇట్లు వసియించి.

గీ. అచట రెట్టఁ బెట్టి యరొక్కదయము గాఁగఁ, దడయ కరిగె నంత దానిరెట్ట
శిలలసంధిఁ బొంద మొలచె నం దొకవట, భూజఫలములోని బీజ ముండి. 45

మ. అది నానాఁటికిఁ బేర్చి శాఖల విహాయస్స్పర్శ మై యుండఁగాఁ
బదియేండ్లుం జనునంత నూడలు కడుం బల్వారి వర్ధిల్లుచుం
గదిసెన్ వచ్చి యధిత్యకాతలమువంక న్మ్రాన్పఁ దాఁ బ్రాకి య
భ్యుదితానంది కిరాతుఁ డొగ్గె నురు లాభూజంబునం దెల్లెడన్. 46

చ. ఉరులు కుజంబునం గలయ నొగ్గి నిషాదుఁడు చన్నమీఁద భా
స్కరుఁ డపరాద్రిఁ జేరె జలజాతవనంబులఁ గ్రీడ మాని స
త్వరగతి మీఱి మీఁదికి సితచ్ఛదముల్ చనుదెంచి యాఁగి వా
గురికలఁ జిక్కె యన్నియును గుందుతఱిన్ మతిమంతుఁ డి ట్లనున్. 47

మ. మన కీపాటులు వచ్చెఁ జూచితిరె నామాటల్ వృథాహంకృతిన్
వినఁగా నొల్లక యల్లరాత్రి యిచటన్ మీ రెల్ల వాదాడి యుం
చినయాకాకము రెట్టలో మొలిచి హెచ్చెం జూవె యీ మఱ్ఱి డి
గ్గిన యాయూడలఁ బ్రాఁకి కాదె మన కొగ్గెం బోయఁ డీజాలమున్. 48

క. తగువానిపలుకు సేయుట, తగ వెఱుఁగక యడచిపడమి తమవారలతో
సగుణత్వము గొను టుత్తము, లగుణము లటు గామి యధములగుణంబు లగున్.

చ. అనవుడు నంచ లి ట్లను మహాత్మ! భవత్ప్రతిభావిలంఘనం
బున మన కిట్టి కీ డిపుడు పెట్టె నుపాయముకల్మి దీనిఁ బా
ప నలవి యేనిఁ బాపి హితబంధుల నిన్నును గాచికొమ్ము నీ
పనిచినయట్లు చేసి భటభావముఁ బొందెద మెల్లవారమున్. 50

వ. అనుటయు మతిమంతుం డి ట్లనియె. 51

క. తమలో నన్యోన్యవశ, త్వము గలిగినబంధు లాపదల నెల్ల నుపా
యమునైఁ బాతురు నిక్కము, కమఠంబులు గరుడబాధ గడచినభంగిన్. 52

వ. కాన భయంబు వలువ దక్కథ వినుం డని యి ట్లనియె. 53

క. అంబుధితీరంబునఁ గూ, ర్మంబులు చరియించుచుండఁ బ్రతిదినమును వా
నిం బట్టి తనకు నాహా, రంబుగఁ గొనుచుండుఁ బక్షిరా జుగ్రుం డై. 54

వ. అట్లు సెల్లుచుండ నొక్కనాఁడు. 55

చ. వననిధినీట నిల్చి ఖగవల్లభుతో నొకకూర్మముఖ్యుఁ డి
ట్లనియె మదీయబంధునివహంబులు దేవరవాతఁ ద్రుంగె నే

న నిలచినాఁడ నిప్పటికి నాకుఁ దొలంగినఁ బోదు నీకు నా
కు నొకటి పన్నిదంబు సమకూఱునె యోలము మాని చెప్పుమా. 56

క. అనుటయు నవ్వుచు వినతా, తనయుం డది యేమి పన్నిదము సెప్పు వయా
యనవుడు నలుగక చిత్తం, బున నెంచుక యవధరింపుము మహావిహగా! 57

ఉ. ఉడువీథిన్ వెస నీవు వాఱ జవసత్త్వోత్సాహ! యంభోధిలోఁ
గడవం బాఱెద నిన్ను మిగులంగాఁ జాలిన న్మైన నె
న్నఁడు భక్షింపకు మమ్ము నోడినటు లైనన్ మాకులం బెల్ల నె
ప్పుడు నాహారము గొమ్ము నీవు వినతాపుత్రా! మహాధార్మికా! 58

వ. ఇవ్విధంబు సేయం దలంపు గలిగెనేని నొక్కనాఁ డిచటికి విజయంచేయుం
డనిన సుపర్ణుం డట్లు చేయుదు నని యొడంబడి పోయిన. 59

క. తనచుట్టంబుల నందఱి, ననువుగ నొకచోటఁ గూర్చి యా కూర్మము తా
ర్క్ష్యునితోఁ దా నొడఁబడి వ, చ్చినచందము వారితోడఁ జెప్పుడు వారున్. 60

క. నినుఁ గడచినమతిమంతులు
మనలోపలఁ గలరె పంపు మము సేపని యై
నను జేయుదు మనవుడు నది
మన మలరఁగఁ జెపుదు వినుఁడు మన మందఱమున్. 61

క. ఆమడ యెడఁ బదిపదిగా, సాముద్రతటంబునీరఁ జని యుండి ఖగ
స్వామి పఱవంగ నాతని, కాముందటివాడు చూపునది పొడ వచటన్. 62

వ. అని యోజ చేసికొని విహగవల్లభుతోడఁ దాను మాటలాడినయెడన యాకచ్ఛ
పంబు నిలిచె నచ్చటు మొదలుకొని యనేకయోజనంబులు దాఁకఁ దక్కి
నవియు నట్ల యుండ మఱునాఁడు సనుదెంచి. 63

క. గరుడుం డవ్వలనికి స, త్వరగతిఁ గూర్మంబుఁ బిలిచి వారిధిపై నం
బరవీథిఁ బెద్దయును ద, వ్వరుగుచు నది చిక్క నోపు నని చీరుటయున్. 64

క. ఓ యని పలుకుచు ముందఱఁ, దోయధిలోఁ గచ్ఛపంబు దోఁచిన మఱియున్
వాయుగతిఁ బఱచి చీఱిన, నాయెడ నగ్రమునఁ గమఠ మల్లన నెగసెన్. 65

వ. అవ్విధంబుఁ గని యచ్చెరు వొందుచు. 66

క. అం దుండి మగుడఁ బఱచుచు, ముందటి యట్లట్ల పిలువ ముందఱ నంతం
తం దోఁచుచు నవి పిఱుఁదులు, ముందఱఁగాఁ జేసి పక్షిముఖ్యునిఁ గెలిచెన్.

క. అతఁడు తనయోటమిని ల, జ్జితుఁ డై మీ కెందు నెగ్గు సేయం బ్రమద
స్థితి నిలువుఁ డనుచుఁ బోయిన, నతిసంతోషమునఁ గచ్ఛపావళి యుండెన్.

వ. అట్లగుటఁ బరస్పరవశ్యు లగుబంధువు లాపద గడవ వచ్చు నింక నైన మదీయ
వచనంబు లంగీకరించెదరేని వినుం డని మతిమంతుం డి ట్లనియె. 69

సీ. కంఠమూలంబునఁ గదిసినయీయురు లూడిచికొని పోవుయుక్తి లేదు
గాని చావక యుండఁ గల దుపాయం బైకమత్యంబు గలిగిన మనకు నెల్ల
నెట్లన్న నిజ్జాల మొడ్డినవేఁటకాఁ డేతెంచు నిందుకు వేగఁ దడయ
కప్పుడు మన మెల్ల నపగతప్రాణులకరణి నుండినఁ జాలు నురులఁ బాపి

గీ. చచ్చినవి మున్న యని తాను జంపు టుడిగి
వటముక్రింద నన్నిటి దిగవైచువాఁడు
డిగ్గ నరుదెంచుతఱిఁ గని దిగ్గనంగఁ
బాఱిపోద మెవ్వరమును బట్టువడక. 70

వ. అనుటయు సంతసిల్లి మరాలంబు లన్నియు నిది లెస్సమతం బని నిశ్చయించి
యమ్మతిమంతునుపదేశంబున నట్ల యుండునంత. 71

గీ. వేఁగుటయు వచ్చి బోయ యవ్విహగయూథ
మున్నచందంబుఁ గనుఁగొని యుల్ల మలరఁ
గడసినవి పుల్గు లురులచే మెడలు బిగిసి
యనుచు వట మెక్కి డిగవైచె నంతవట్టు. 72

క. ఒకఁ డొకఁడు డిగ్గ వైవఁగ, సకలంబును బ్రోవు గట్టి సంభ్రమమున ని
ల్వక చనె మతిమంతుఁ డొకఁడు, నొక కడపటిశాఖయందు నురి నుండంగన్.

గీ. అతని రాకఁ దలంపక యధికభీతిఁ
బోవుటయు ఱిచ్చపడి ముండపులుఁగు లకట
మోసపుచ్చెర నన్నని డాసి బోయ
యలిగి మతిమంతుమెడ బిగ్గ నులిమి చంపె. 74

క. మతిధృతి లేనివెడంగుల, మతి గఱపినసుమతికిం బ్రమాదము వచ్చున్
మతి గఱపినమతిమంతుఁడు, సితచ్ఛదోత్కరముచేతఁ జెడ్డవిధమునన్. 75

క. మతిమంతుం డవ్విధమున, హతుఁ డయ్యెం దక్కఁగలుగునాంసలు దుఃఖా
యతనంబు లయ్యెఁ దముఁ గు, త్సితకాకం బొక్కరేయి సేరినకతనన్. 76

క. కావున నీసర్పము మన, యావాసముఁ జేరె నేని నతిశయదుఃఖం
బీవశత వచ్చు దీనికిఁ, ద్రో వెఱిఁగించెడితలంపుఁ దొలఁగుము బుద్ధిన్. 77

క. నీ వుపకారం బితనికిఁ, గావింపఁ గడంగి యధికకరుణామతి వై
యావిధము సేయుచుండియు, భావింపందగు నపాత్రపాత్రత లెందున్... 78

ఒకరికి ఉపకారము చేసిన వాళ్ళు తిరిగి ఉపకారం చేస్తారని ఆశపడకూడదని చెప్పినది

క. క్రూరు లగుజనులు ప్రత్యుప, కారంబులు సేయఁజాలకయ సుజనులపై
నారోపింతురు తప్పులు, కారండవచయమువలనఁ గాకులుపోలెన్. 79

వ. అక్కథ యె ట్లనినం బురాతనకాలంబున. పదం ఖాళీ ఉంది 80

క. కోసలదేశంబున ధా, రాసనుఁ డనఁగాఁ గలండు రా జతఁడు నయ
వ్యాసంగము ధర్మంబున్, బాని చరింపంగఁ దొడఁగెఁ బ్రజలు దలంకన్.

క. ఆరాజు సేయునెగ్గులఁ, గారణముగ జనపదమునఁ గఱ వగుటయు ము
న్నారాష్ట్రంబు దమకు నా, ధారమ్ముగ నుండుకాకితండం బెల్లన్. 82

వ. ఒకయెడం గూడుకొని. 83

క. ముంగిళ్ళ నెండువులు గా, నంగఁ బడవు గలుగుపట్టునం గాపు ఘనం
బెంగిలిమెతుకులు నల్లుట, యుం గలుగదు మున్నపోలె నుర్విం దఱుచుగన్. 84

క. కడు బలు లిడలే రిచ్చటఁ, బెడమాయపుటాస లెల్ల వేగ విడిచి యొం
డెడ కరిగి నేరిచినక్రియఁ, గడుపులు రక్షించుకొనుట కార్యము మనకున్. 85

మ. అని కాకుల్ తమదేశముం బిడిచి భుక్త్యాకాంక్ష నెం దేనియుం
జనుచో దవ్వులఁ బ్రోవ నొక్కయెడఁ గాసారంబులోనుండి క
న్గొని మోదంబున నీరుకాకు లనుపక్షుల్ పక్షిజాతిత్వమా
త్రవిబద్ధం బగుబాంధవంబునన చేరంబోయి ప్రార్థించుచున్. 86

ఉ. తోకొని వచ్చినం బోలుతఁ దోయజషండముఁ దన్పుతియ్యనీ
రేకట బోవఁ గ్రోలి దరి నిమ్మగుచెట్టులనీడ నుండఁగాఁ
బ్రోఁకలు గట్టి వారిఖగముల్ తమముందఱఁ బెట్టుమీలఁ బే
రాఁకలి యల్లఁ దీర్చుకొని యచ్చట నద్దినరాత్ర ముండుచున్. 87

సీ. కదలి పేషవ నేఁగఁ గడఁగుచో నప్పుడు నీరుకాకులు వచ్చి మీర లేమి
పనికి నెచ్చోటికిఁ జనియెద రనిన మా వసియించుదేశ మవగ్రహమున
నలఁగిన నాహారములు లేక యిందఱుఁ బండినభూముల కొండుకడకు
నరిగెద మనినవాయసములఁ గారండవము లట్టిదేని నేవలను నేల

గీ. యిచట నిల్వుఁ డింక దీకొల నెన్నఁడు, జలచరములు నిందుఁ జాలఁ గలుగు
ననుడుఁ గాక లబ్బ వామిషంబులు మాకు, మేము నీఁదు వెరవు లేమిఁజేసి. 88

క. కావున నుదరము లిచ్చట, నేవెరవునఁ బ్రోచికొందు మే మనుటయు మే
మీవిధ మెఱుఁగుచు నొండొక, తావునకుం బోవ నిచ్చట తగవె మాకున్.

వ. అని మఱియును. 90

క. కారండవమ్ము లనియెన్, మీ రూరక కొలనికఱఁత నిలువుఁడు మీ కా
హారంబులు గా నిచ్చలు, వారిచరోత్కరముఁ బెట్టువారము తనియన్. 91

వ అనుటయు నగుఁ గాక యని నిలిచి. 92

మ. జలపక్షుల్ వెలి వైవఁ గ్రొవ్వు గలమత్స్యవ్రాతమున్ మ్రింగుచున్
జలజావాససమీపకుంజశిశిరచ్ఛాయాప్రదేశంబులన్
లలిఁ గ్రీడించుచు లీల నట్లమితకాలం బచ్చటం బుచ్చి య
బ్బలిపుష్టంబులు పుష్టదేహములతోఁ బ్రహ్లాదముం జెందుచున్. 93

క. తమదేశంబున దుర్భి, క్షము వాయుట యరసి యెఱిఁగి చనుచుండి విచా
రము సేయఁ దొడఁగె నప్పుడు, తమలో నన్నిచఖగవితానము లెల్లన్. 94

క. కారండవములు మన కుప, కారము చేసినవి వీనిఁ గన్ను మొఱఁగి పో
నేరక యుండినఁ బ్రత్యుప, కారము సేయంగ శక్తి కలదే పిదపన్. 95

వ. అనుపలుకులు విని యందుఁ గొన్ని యి ట్లనియె. 96

క. వీరికిఁ జెప్పక పోయినఁ, జోరత్వము వచ్చుఁ జెప్పి సులభప్రీతిన్
వీ రనుపఁ జనినఁ బ్రత్యుప, కారం బొకయపుడు సేయఁగా వలయుఁ దుదిన్. 97

వ. అ ట్లగుటం జేసి. 98

క. వీరు మనకుఁ జేసినయుప, కారం బప్పగ ని దేల కైకొని పోవన్
వీరిపయిం ద ప్పొక్కటి, యారోపింపుదము గాక యది యెల్లఁ జెడున్. 99

క. అనవుడు వీరలమీఁదను
నొనరింపఁగ దోస మొకటి యొనరినయది క
ల్గునె యనుచు వెదకి కొఱఁతలు
గనుఁగొని యన్నియును జలఖగంబులకడకున్. 100

వ. చని వాని నుద్దేశించి. 101

క. చిరజీవము మా నామము, సరకే మా కొకటి యిష్టసంచారము మై
నరుగక మీ రిట నాఁపినఁ, బరిభవములఁ బొంద నాఁపఁ బడితిమి మీచేన్.

చ. నెల పదిప్రొద్దు లే మిచట నిల్చినమాత్రన మాకు మీర లెం
గిలి సతతంబు వెట్టితిరి కిల్బిషవర్తనులార! యక్కఱల్
కలుగవె యెట్టివారికి జగంబున నోడల బండ్లు బండ్ల నో
డలుఁ జనుదెంచు నంట యకటా! వినరే యిటుఁ జేయఁ గూడునే? 103

వ. అదియునుం గాక, 104

క. పుచ్ఛంబు లెత్తి మీ వగు
పుచ్ఛంబులక్రింది మాకుఁ బొరిఁ జూపుచు న
స్వచ్ఛు లయి నీటఁ గ్రుంకెదు
తుచ్ఛుల మిముఁ దిట్టఁ జాలుదుమె యెట్లైనన్. 105

గీ. వ్రతులు మాలోన సగ ముంద్రు వార లిచటఁ
జేరు టాదిగ నొల్ల రాహార మెపుడు
సరసిఁ గ్రుంకుచు మీరు పుచ్ఛములక్రిందుఁ
జూపఁ జూచుచు రోఁతలు చుట్టుకొనిన. 106

వ. అని పలికి. 107

క. మీకొఱగాములు సర్వము, మీ కండుం గాత యనుచు మింటఁ గలగొనఁగా
గా కా యని యఱచుచు వెసఁ, గాకులు పూర్వప్రదేశగమనముఁ జెందెన్.

వ. అట్లగుటం జేసి. 109

క. ఉపకార ముత్తముఁడు తన
కృపమొక్కలమున నొనర్పఁ గిల్బిషుఁ డొకప్ర
త్యుపకారము వెదకం డొక
యపకారమె రోయు నొండె నాపదఁ జేయున్. 110

క. అని కృష్ణరూపి చెప్పిన, వినియును నప్పాఁపచెలిమి విడక తనమనం
బునఁ గలతలంపు మానని, తనపతికి వృకోదరప్రధానుం డనియెన్. 111

క. ఖలులవలు నాపద మూడినఁ, జెలి యై తగువాఁడు సక్కఁజేయుట యెల్లం
బులికి నొకగ్రామణిపోటుం, బులుఁ గుపకారంబు సేయుపోల్కి యగుఁ దుదిన్.

వ. ఆకథ యె ట్లనినఁ దొల్లి యొక్క కాంతారంబున. 113

శా. లీలానిర్జితసర్వజంతు వన బల్మిన్ బేర కొన్నట్టిశా
ర్దూలం బొక్కజరన్మృగంబు నొకచో దుర్దాంత మై వ్రేసి త
త్కీలాలం బది మున్ను గ్రోలి యుదరోద్దీవ్యద్బుభుక్షానల
జ్వాలల్ త న్నలఁపంగఁ దల్చె శితమాంసం బొంది భక్షింపఁగన్. 114

ఉ. కోఱలసంధి సెంపములు గ్రుంకిన నంత దినక్రమంబునన్
మీఱిననొవ్వి భుక్తిఁ గొన నేరక యాననగహ్వరంబునం
గాఱెడులాలతోడఁ బులి గ్రచ్చఱి లోఁబడి యుండ గ్రామణిపైఁ
గూఱినవంత నొక్క ద్రుమకుట్టవిహంగము దాని కిట్లనెన్. 115

ఉ. నొవ్వి యలంపఁ గూసెదవు నో రొకమాటును మూయ వే లాక్రో
తివ్వలు కాలఁ జుట్టినను దెంపఁగ లేవు తరక్షునాథ! నీ
కివ్విధ మైనయాపదకు నేది కతంబు విధాత యక్కటా!
యెవ్వరి నెట్లు సేయఁడు విహీనమతిం బ్రతికూలుఁ డైనచోన్. 116

క. అనుటయు దానికిఁ జెప్పెం, దనపొందినవేధ పులి, యుదారోపాయం
బునఁ దీనిఁ బుత్తు నేమే, లానరించెద వని విహంగ మొయ్యనఁ బలికెన్. 117

చ. అనవుడుఁ జిత్రకాయము ప్రియంబున నట్టిదయేని నొక్క మే
లని మితి సేయ నేమిటికి నాప్తసఖుండు గ నిన్నుఁ జేసి యే
వనమున నేమిజంతువు నవారణఁ జంపిన మాంస మర్ధముం
గొను మని యిత్తు నేహితముఁ గోరినఁ జేయుదు నీకు నెచ్చెలీ! 118

క. నావుడుఁ బెద్దయు విప్పుగ, నీవదనముఁ దెఱవు మనుచు నియమించి దురం
తావిర్భావితసాహస, యై విహగం బందుఁ జొచ్చె నతినిపుణతతోన్. 119

గీ. దంష్ట్రికలు పాదమునఁ గొని తన్ని సంధి
నున్నయెముకను సంచున నూఁది పట్టి
పాపి కదలిచి పెఱికి యాపక్షి యధిక
వేగమునఁ బులివాఁగడ వెడలి పోయి. 120

క. ద్రుమశాఖ నెక్కి యెముకను
నుమిసినఁ బులినోట నొవ్వి యుడిగి మఱి దిన
క్రమమునఁ బుం డాఱిన నొ
క్క మహామృగమును వధించికొని యొకచోటన్. 121

క. నమలంగా నచ్చోటికి, ద్రుమకుట్టము వచ్చి కట్టెదుట నిలిచి మృగో
త్తమ! నాభుక్తికిఁ దగుమాం, సము వెట్టుము పలుకు మృదువచనములు నాతోన్.

వ. అని పలుకుటయు. 123

క. నీ వెవ్వరు మాంసం బే, లా వలసె న్నీకు నేను లంచము వెట్టన్
నీవు పులుఁగ వే మృగపతి, నా వచనమ్ములఁ బ్రయోజనము నీ కేలా? 124

క. అనవుడు నెఱుఁగవె నన్ను వ, దనకుహరములోనఁ జొచ్చి దాడలయెడ నాఁ
టినశల్యముఁ బెఱికినచెలిఁ, జను నే నను మఱవ నీకు శార్దూలపతీ! 125

వ. అనుపలుకు విని నవ్వుచు నది యాద్రుమకుట్టంబుతో ని ట్లనియె. 126

గీ. కాయ లుడివోయినట్టివృక్షంబుఁ బాఁడి
యెల్లఁ గడచినధేనువు నేఱు గడపి

నతఁడుఁ గార్యము దీర్చినయతఁడు నపుడ
గాని యాదరణీయులు కారు పిదప. 127

వ. అది యెట్టి దనిన వినుము. 128

మ. విపినాంతర్బహుసత్త్వఘాతుకుఁడ నై విఖ్యాతకృత్యుండ నై
కృప యొక్కింతయు లేనినావదనముం గ్రీడారతిం జొచ్చినం
గుపితత్వంబున మ్రింగినం జనఁగ నీకుం గ్రమ్మఱం గల్గునే
యుపకారం బన నింతకంటె మఱి యిం కొం డెద్ది యూహింపుమా. 129

వ. అని యి ట్లావ్యాఘ్రంబు ప్రలాపింప నప్పటికిం జేయునది లేక ద్రుమకుట్టంబు తొలఁగి పోయి యాత్మగతంబున. 130

క. ఇలపైఁ బాదాహత మై, తల వట్టడు నెగసి ధూళి, తా నొకరునిచే
నలఁపఁబడి వానిఁ దొడరం, దలఁకిన నచ్చేనటికంటెఁ దక్కువ కాఁదే. 131

చ. అని చిత్తంబునఁ జెంపుఁ జేసికొని రోషాద్ధిష్ఠ మై పొంచి కీ
డొనరింపం దఱి వేచి యుండి విహగం బొక్కింత యాలస్య మూ
నినశార్దూలముకన్ను వోఁ బొడిచి పూర్ణీభూతసంతోష మై !
చని భూజాగ్రముఁ బొంది యి ట్లనియె హాస్యప్రౌఢవాక్యంబులన్. 132

క. వింటే మృగమా ! పోయిన, క్షంటికి వగవకుము రెండుకన్నులు వోలియం
గొంట యుడుగుటకు నొకక, న్నుంటకు సంతసముఁ జెందు టుచితము నీకున్.

క. అని పలికి యది నిజేచ్ఛం, జనుటయు నయనంబునొవ్వి సైఁపక పులి య
వ్వన మద్రువక వాపోవుచుఁ, దనదుకృతఘ్నత్వమునన తా హత మయ్యెన్.

వ. కావున. 135

క. బలహీను లగుచు ధీమం, తుల కెగ్గులు సేసి పొందుదురు కీడు మహా
బలు లయ్యు మ్రానిపోటుం, బులుఁగుఁ బరిభవించి తొల్లి పులి చెడ్డక్రియన్.

వ. అనుటయు నశ్భకంబుల నుద్దేశించి భయదర్శకం బి ట్లనియె. 137

క. ఏ నొకపుడి సెఁడు ద్రావిన, నీనూతిజలంబు పాలియునే యంతయు నా
తో నేల పోర నీళ్ళకు, నై నిష్ఠురలోభ మింత యగునే చేయన్. 138

క. తగుకొలఁదిఁ గాని లోభము, మిగులఁగఁ జేయంగ రాదు మిక్కిలి యగులో
భగుణంబుకతనఁ గాదే, మృగధూర్తం డొకఁడు తొల్లి మృత్యువుఁ జెందెన్.

వ. అది యె ట్లనిన నక్కథ వినుం డని యి ట్లనియె. 140

సీ. విజయపురప్రాంతవిపినాంతరమునకు బోయ యొక్కఁడు వేఁట వోయి యచట
వనహస్తిఁ గనుఁగొని వల్మీక మెక్కి భల్లమునఁ దుండము ద్రుంచి సమయఁ జేసె

వానియెక్కినపుట్టలోను వెల్వడి భుజంగం బక్కిరాతునిఁ గఱచె నంత
వాఁడును మొల నున్నవాఁడికుఠారంబు గొని దాని వధియించి కూలి యీాత్త

గీ. నచటి కొక్కనక్క యరుదెంచి ముద మంది, యేనుఁ గాఱునెలలు మానవుండు
సప్తవాసరములు సర్ప మేకదినంబుఁ, బోవుఁ బొమ్ము తనకు భుక్తి కనుచు.

క. నేఁటి కివి గంటి వెట్టఁగ, నేటికి నీబోయ వింట నిడ్డనరము లీ
పూఁటఁ గడపఁ జాలవె యొక, నాఁటం బ్రాణంబు సనునె నవసినమాత్రన్.

క. అని తలఁచి యెక్కు వెట్టిన
ధనువుఁ గదిసి దానికొమ్ముఁ దనగొంతుంగ్రో
లున మోచి యుండఁ జెలఁగుచు
గొనయంబునరంబు లొయ్యఁ గొఱకఁ దొడంగెన్. 144

గీ. నరము లొక్కఁ డొకఁడు నానిచి కొఱకంగ
గొనయు మెల్లఁ ద్రెవ్వి ధనువుకొమ్ము
మిడిసి గళము నాఁటి పెడతల వెడలినఁ
గూసికొనుచు నక్క కూలి గెడసె. 145

వ. అట్లగుటంజేసి లోభం బొప్ప దనుద్విజిహ్వోపలుకు లాక్షేపించుచు నసారి
యనుహారి లోభం బొప్ప దేనియు నతివ్యయశీలత్వంబు మేలె యని యి
ట్లనియె. 146

క. కలిమిఁ దలము గానివ్యయం, బులు పెరిమెలకొఱకుఁ జేసి పొలియరె దుర్బు
ద్ధులు శారికేళిబక మను, పులుఁగు మైశ్వర్యమహిమఁ బొలిసినభంగిన్.

వ. అది యె ట్లనిన. 148

గీ. పెక్కునీళులు లేనట్టి యొక్కమడఁగు
క్రేవ నున్నత మగు నారికేళ మొకటి
చీకకొక్కర యొకటి వసించు నచట
వారిబహుతరజలచరాహార మగుచు. 149

క. అది యొకనాఁ డంబరమునఁ
బదివేలు బకాదివారిపక్షులు సనఁగా
నదె నాకొలసాములు వో
యెద రని యడ్డముగఁ బాఱి యెక్కుడు ప్రియముల్.  150

క. కావించి మీర లూరక, పోవుట దగ దల్లభూజమున నిలుతు మదీ
యావాసం బది యచటికి, రావలయును బాంధవాభిరంజన మొసఁగన్.

వ. అని తన వసియించునారికేళంబును జూపి ప్రార్థించి మఱియును.

క. కొల నొక్కటి కల దచ్చట, జలములు నాహారములు ప్రశస్తరుచులతోఁ
గలిగెడి నేటికి మాటలు, కొల మెల్లను బొగడ విందు గోరి యొనర్తున్.

వ. అనుపలుకులు విని బుద్ధిమంతంబు లగువిహంగములు కొన్ని. 154

చ. వలవదు మమ్ము నాఁగ గుణవంతుఁడ వీవు కొలంబువారిపైఁ
గలిగినభక్తియుం బ్రియముఁ గన్గొన సంతస మయ్యె నిచ్చలున్
నిలిచినఁ గాని కాదె గమనింపఁగ ని మ్మని పెక్కుభంగులన్
బలికినఁ బోవకున్నఁ గని పక్షులలోపలఁ గొన్ని దానితోన్. 155

క. ఈయూథ మిది యనంతము, నీయిర వెడ లేదు నిలువ నీ చెప్పినయా
తోయంబులు నాహారము, మాయెఱుఁగనియదియె యల్పమాత్రము లవియున్.

వ. అట్లుం గాక. 157

క. కనుకొలఁకునందలివి మఱి, చన నొండొకదెసకు నీవు చాలవు నీ కొ
క్కని కైనను జలదాగమ, మునయంతకు నోర్చు మడుఁగు పోనిమ్ము మమున్.

చ. అనుటయుఁ బొత్తువారికృప నన్నియుఁ గల్గెడునన్నుఁ ద్రోచిపో
యినఁ గుల మెల్లఁ గన్గొనఁగ నిప్పుడ మేను దొరంగువాఁడఁ జుం
డనుడుఁ బతత్రికోటి మన కాఱడిఁ బాపుముఁ బొంద నేటి కి
ట్లని యితఁ డాడ నంచుఁ జని రందఱుఁ గొక్కెరయింటివిందులై. 159

వ. అట్లు పోయి.

మ. మడు వెల్ల స్వైరఁజాడి మందు కయినన్ మత్స్యంబు లేకుండ న
ప్పుడ యొండొంటికి మున్ను మ్రింగి విహగంబుల్ మాపు నిల్వంగ ని
క్కడ ని మ్మేమియుఁ జాల దంచుఁ జనినం గారించుపేరాఁకటన్
మడిసెన్ గొక్కెర కొన్నిప్రొద్దులకు హీనం బైనదేహంబుతోన్. 161

వ. అ ట్లగుటం జేసి. 162

క. వ్యవసాయముకొలఁదియు దే, శవిధముఁ గాలంబుఁ బూర్వసంచిత మగుసా
మ్ము విచారింపక యుబ్బునఁ, దివిరి వ్యయము సేయునతఁడు దీనతఁ జెందున్.

క. అమరఁగ నాయవ్యయముల, క్రమము జలము పెద్దవాతఁ గైకొని యది స
న్నముగ వెలార్చుచు నుండెడి, కమండలువుఁ జూచి యైనఁ గాదే తెలియన్.

వ. అనుటయు భయదర్శకం బుచితలోభంబు కర్తవ్యంబు. 165

క. అతిలోభ మొప్ప దతిలు, బ్ధత ధనగుప్తుం డనంగఁ బరఁగినవణిజుం
డతిశయనిజవిత్తము భూ, పతిపాలుగఁ జేత వినఁగఁ బడదే కథలన్. 166

వ. అక్కథ యెట్లనిన. 167

ఉ. ఉర్వికి భూషణం బయినయుజ్జయినీనగరంబులోపలన్
గుర్వనురాగమూర్తి ధనగుప్తుఁడు పుణ్యుఁడు వర్ధమానుఁడున్
సర్వధనప్రపూర్ణు లయి సఖ్యముఁ బొంది వణిక్కులంబులోఁ
బర్వినపెంపుతోడ ననపాయవిభూతి వహించుచుండుచున్. 168

ఉ. జీవపుదీవి నిమ్మను బసిండియుఁ దుల్య మటన్న నచ్చటన్
వానియ మాడఁ బోద మని నావల వే ఱొకఁ డాయితంబుగాఁ
బూని ఘటింప నం దినుము పూర్ణముగాఁ గొని పెట్టు లిద్దఱున్
ఫేనతరంగభంగురగభీరపయోనిధిలోన నావపై. 169

చ. అరుగఁగ వర్ధమానుని మహాజ్వర మొందిన నేన చాలుదున్
శరనిధియాత్రకున్ వలదు చయ్యన నేఁగుము నీవు నీవ నే
నెఱపి భవద్ధనంబు నిడనే యెడ నేయఁ దలంతునే కటా!
మరలుము నీవు గల్గిన సమస్తశుభంబులు కల్గు నెచ్చెలీ! 170

మ. అని వానిన్ మగిడించి తాన చని యి న్మాదీవి నెత్తెంటికిన్
గనకం బెత్తులు రెంటిలెక్కఁ దెగినం గైకొంచు నాల్గోడలన్
నినుపారంగ సువర్ణ మెత్తుకొని పూర్ణీభూతసానందసం
జనితోద్గర్వమనస్కుఁ డై మరలి యాసాముద్రమధ్యంబునన్. 171

క. చనుదెంచుచు ధనగుప్తుఁడు, మనమునఁ దలపోసె వర్ధమానుని యోడెం
డినుమునకై రెం డోడల, కనకము నా కెట్లొసంగఁగా నోప నగున్. 172

క. ఈసొమ్ములలో నతనికి, వీసము నీఁజాల నేను వెనుక నతం డా
యాసపడి తాను గూర్చిన, యాసకలార్థంబు నాకు నర యొసఁగెడినే. 173

క. ఎక్కడిచెలితన మాతం, డెక్కడిచుట్టంబు నాకు నీవననిధిలోఁ
గ్రక్కున మునిఁగిన నప్పుడు, చక్కంబెట్టెడినె యతనిసఖ్యము నన్నున్.

వ. అని తలంపుచు నంభోధిలోనం బడి. 175

ఉ. వచ్చుచు వర్ధమానుదెసవారల నెల్లర నీటిలోపలం
జెచ్చెరఁ ద్రోచి చంపి యొకచెంగటిఱేవున వీడుఁ జేరి తా
నచ్చట నాచతుష్క మగునర్థముఁ బ్రాఁతి దరిద్రతాభరం
బచ్చువడంగఁ జేసికొని యాత్మనివాసముఁ జెంది యుండఁగన్. 176

గీ. వర్ధమానుఁ డపుడు వచ్చి యన్యోన్యస, మాగమోచితంబు లైనవాని
నడపి యేను బీడ వడితిఁ బెక్కులు సేగు, లయ్యొ యనుచుఁ బిదప నాడి మఱియు,

ఉ. సొ మ్మఖిలంబుఁ బోయిన విశుద్ధచరిత్ర! భవత్ప్రతిప్రయా
ణమ్ము మనంబులో ననుదినంబును గోరఁగ రాక గల్గె మీ
రెమ్మెయి లాభముం బడసి యేక్రియ వచ్చితి రన్న లేనిదుః
ఖమ్ము నటించుచున్ సుకృతఘస్మరుఁ డాధనగుప్తుఁ డి ట్లనున్. 178

శా. అన్నా! యే మని చెప్పుదుం జెఱచె దయ్యం బ్రమాదంబునన్
మున్నీ రెల్లను దాఁటి యమ్మడుపురంబుం జేరి యం దొక్కయిం
ట న్నిండారఁగ బండ మెల్ల నిడి యుండంగం ద్రిరాత్రంబులో
విన్నం బొం కగునట్లు గాఁగ నెలుకల్ వే మ్రింగె నా లోహముల్. 179

క. కొండంత యినుములోపల, ముండయెలుక లేమి చోద్యమో పాలికయె
తుండ నియక తినె నచ్చట, నుండఁగ లజ్జించి మగుడ నుదధి గడచితిన్. 180

క. పొలిసిరి తెవుళ్ళ నీవా, రలు రోగము లచటఁ బెద్ద రాఁబో నెడ రై
యలజడిఁ జెందితిఁ బాపపుఁ, జెలి నగునే నకట! నిన్నుఁ జెఱచితిఁ జాలన్.

క. అని పలికి వీడుకొలిపిన, ననయము నిది బొంకు పొసఁగ దాత్మధనము వం
చనఁ గొనియె నితం డని తన, మనమునఁ దెలిసియును వర్ధమానుం డచటన్.

వ. ఏమియుం బలుకక నిజగృహంబున కరిగి యి ట్లని తలంచె. 183

గీ. నమ్మఁ దగదు మొదల నమ్మి తా రాత్మకా
ర్యమున కొరులఁ బనిచి యందు వార
లరయ సేసి రేని నడియాల మెఱుఁగక
వేగపడుట యెల్ల వెఱ్ఱితనము. 184

క. సొమ్ములయెడ నెవ్వారల, నమ్మఁ దగదు నమ్మకుండినను జరగ దిలన్
సొమ్ము గలవారి కర్హుల, నమ్మఁగఁ గీడైన నే మనం గలదు తుదిన్. 185

క. తనదేహము నిత్యంబే, తనధన మది సెప్ప నేల తాను దనధనం
బును దైవధనంబులు తన, ధనము లతఁడు పఱచినట్లు తగదే పడఁగన్. 186

క. చెలితనమునఁ దనుఁ జెఱచిన
తులువం గని తొలఁగి పోక తోరపుఁబ్రియముల్
పలుకులతీపులుఁ జూపుచుఁ
జెలి యై వర్తించి గాక చెఱుపఁగ నగునే. 187

క. అని నిశ్చయించి యాతని, తనయెడ నొకవెఱపు లేనిదట్టపునెయ్యం
బొనర నటియించి యొకనాఁ, డనురాగియుపోలె నతనియాత్మోద్భవునిన్.

క. లాలనము సేయుచుం దన, యాలయమున కెత్తికొని రయంబునఁ జని యే
కీలున నెవ్వరు నెఱుఁగం, జాలనియెడ డాఁచి దుఃఖిచాద్భ్వన నుండెన్. 189

ఉ. కొండొకసేపులోన ధనగుప్తునివారలు వచ్చి పాపనిం
డెం డని పల్కినన్ వగచి తెక్కలిగృధ్ర మొకండు నాదుచే
నుండఁగ బిడ్డ నెత్తుకొని యుగ్రతఁ బోయిన నేమి చెప్పుదు
న్నిండినతీవ్రదుఃఖ మనునీట మునింగినవాఁడువోలె నై. 190

ఉ. సెట్టికిఁ జెప్ప రా నచటఁ జేరఁగ నోడెద నన్నుఁ బోయి యా
పట్టివిధంబు వా రతనిపల్కినయట్లన చెప్పినం బులిం
గొట్టినమాడ్కి నల్గి ధనగుప్తుఁడు లోకములోన నెన్నఁడే
నిట్టివి వింటిరే యని మహీంద్రున కవ్విధ మెల్లఁ జెప్పినన్. 191

గీ. వర్ధమానుని రప్పించి వసుమతీశుఁ, డింత నెఱమానిసివి బొంక నిట్లు తగునె?
బాలకుని గ్రద్ద యెత్తుక పాఱె ననుట, యే యుగంబుల నెచ్చట నేనిఁ గలదె?

వ. అనిన వర్ధమానుఁడు ముకుళితకరకమలుం డై యిట్లు విన్నవించె. 193

ఉ. దేవర పొందుగా నిది మదిం బరికించితి రిట్లు సర్వమున్
భావములోఁ నెఱుంగఁ దగు నావలరెంటియయంబు నెల్క లీ
భూవలయంబునం దినుట పో లగునే యిది సెట్టి సెప్పెడున్
నా వేఁడు మద్ధనంబుఁ గొని నా కిడ నొల్లక శాఠ్యబుద్ధి యై. 194

క. అనుటయు జనపతి యిది యె, ట్లని యా ధనగుప్తుఁ జూచి యడిగిన నతఁ డీ
తనిపొత్తునఁ జినమునకై, యిను మోడల రెంటఁ గొంచు నేఁగితి నధిపా! 195

క. కొనిపోయినయినుమ మంతయుఁ, దన దగుభాగ్యమున నెలుకతండము భక్షిం
చిన నా యిను మోడెంటికిఁ, గనకం బోడెఁ డని నన్నుఁ గల్లలె నడపెన్.

వ. అనిన వర్ధమానుం డప్పలుకులు దెలియ నవధరింపుం డని రాజు నుద్దేశించి, 197

క. రెండోడ లినుము మూషిక, కాండము భక్షించె ననుట కల్లపలుకు గా
కుండినటు లయిన గృధ్ర మొ, కం డొకబాలుఁ గొనిపోక కడు ననుచితమే?

చ. అనవుడు రాజు నవ్వి సచివావళిఁ జూచుచు నంతమేటిబాం
కున కిది పోలు నంచు ధనగుప్తుఁ గనుంగొని యెట్టిమాట లా
యినుము భుజించునే యెలుక లింతటిమానిసి విట్లు పల్కినన్
విని ప్రజ నవ్వదే యతనివిత్తము నాతని కిమ్ము నావుడున్. 199

క. ధనగుప్తుం డితఁ డిచ్చిన, యినుమున కే నినుము గాక యేలా యిత్తుం

గనకం బనుటయు భూపతి, కనలుచుఁ దనయొద్దఁ జనవు గలలెంకలతోన్.

క. ఓరీ! కోమటిముక్కున, నీ రెత్తఁడు మేము కినియ నేరక యున్నన్
నోరికి వచ్చినయట్టులు, వారణ యొక్కింత లేక వదరు లఱచెడిన్. 201

మ. అనినన్ లెంకలు ద్రోచికొంచుఁ జనఁగా నయ్యా! కటా! బొంకితిన్
గనకం బోడెఁడు కల్గెఁ గాని మిగులం గా లేదు మీయాన యీ
తనికై యర్థము వెట్టఁ బంపుఁ డనుడుం దథ్యంబు గా దిప్పు డీ
తనిప ల్కించు విభుండు పల్కుటయు బాధం బెట్టఁగా నత్తఱిన్. 202

చ. ఇనుమున కర్థిలోఁ బసిఁడి యిమ్మడి గల్గుట నాలుగోడలం
గనకము తాను దెచ్చి చెలికానిభటప్రకరంబుఁ గ్రూరతన్
వననిధిఁ ద్రోచి చంపుట సువర్ణము పాఁతినచోటు సర్వమున్
గొనమునప్రోక యైనధనగుప్తఁడు సెప్పిన రాజు నవ్వుచున్. 203

మ. ధన మెల్లం గడు వేగఁ దేఁ బనిచి చేతఃప్రీతితో వర్ధమా
నుని కొప్పించిన దేవ! నాధనము నన్నుం జేరినం జాలు నం
చు నతం డర్థముఁ గొన్న మెచ్చుచు మహీశుం డున్నయయ్యర్థముం
ధనగుప్తార్జితసర్వవిత్తచయముం దాఁ గొంచు నుగ్రాకృతిన్. 204

క. ఇలుఁ బురమును దేశంబున్, వెలువడఁ ద్రోపించుటయును నెలఁతుకయును బి
డ్డలుఁ దానుం దిరిసి తినుచు, నిలపై ధనగుప్తుఁ డిట్టియిడుమలఁ బడియెన్. 205

క. కలమెం డినుమునకై యిరు, కలములహేమంబు తనకుఁ గలిగినయపుడున్
వలను గలిగి ధనగుప్తఁడు, మెలఁగంగా నేరఁ డల్పమేధత్వమునన్. 206

క. లోభంబున ధనగుప్తుని, ప్రాభవ మట్లడఁగె నాదుపలుకులు విను మీ
లోభం బుడుగుఁడు నీకుల, కై భూమిని నిట్టిలోభ మగు నే చేయన్. 207

వ. అని పల్కి యవ్వర్షాభూవల్లభు మున్నవోలె బహువిధంబుల స్తుతియించి భయ
దర్శకంబు మఱియు ని ట్లనియె. 208

గీ. చిఱుతనాఁటఁగోలె జీవహింస యొనర్చ, దానివ్రతము గాఁగఁ దడవ నేల
జీవహింసఁ జేయుజీవుల సోఁకిన, గాలి సోఁకఁ దలఁతుఁ గల్మషముగ. 209

వ. అనుటయు నప్పలుకు లుద్దేశించి యభిజ్ఞుం డనుప్లవంగంబు దనపతి కి ట్లనియె.

క. అతినిష్ఠ యనాచారం, బతిశౌచ మశౌచభంగి యతినింద యతి
స్తుతి యివి ధూర్తవిధము లీ, గతి యతినైష్ఠ్యంబు దుష్టకపటము దెలియన్.

వ. అది యె ట్లనిన. 212

గీ. ప్రాయమునఁ బెద్దవాఁ డొకబ్రాహ్మణుండు
లక్షణజ్ఞుండు సంగతలక్షణాంగి
నొక్కకన్నియఁ బెండ్లి యై యొరులగోష్ఠి
మరగ కుండంగ సఖి నేలమాలెఁ బెట్టి. 213

క. పెనుపఁగ నంద పెరిఁగి యా, వనితయు యౌవనవిలాసవైభవముం దా
ల్చిన ఋతుకాలం బన విని, చనుదెంచెను విప్రుఁ డొకనిశాసమయమునన్. 214

గీ. వచ్చి యాలి మానవతి నోరకన్నులఁ, జూచి బిట్టబిఱ్ఱుసురతమునకు
వేగపడిన నచట వెలిఁగెడిదీపంబుఁ, జూపి యిట్టు లనియె సుదతి పతికి. 215

క. అనలుఁడు పురుషుఁడు దీపం, బనలుఁడు పరపురుషుఁ డైనయనలుని నేఁ జూ
చినఁ దప్పు కాక న న్నితఁ, డనవరతముఁ జూచుచుండ నర్హుం డగునే. 216

క. కావునఁ దమప్రాణేశుల, దీవియ లుండంగఁ గవయుతెఱవలశీలం
బే వెలితిగఁ దలఁతు ననుచు, దీవియ దెంచి సుఖకేలిఁ దేల్చె నిజేశున్. 217

చ. అతఁడును సౌఖ్య మొంది తనయంగన యాడినసాదుమాట వ్రా
ద్గతముగ దాని శీలవతిఁ గా మది నమ్మి నిజేచ్ఛ నున్నచోఁ
గతిపయమాసము ల్చనిన గర్భిణి యై యొకనాఁటిరాత్రి యే
కతమున నాథుతోఁ బ్రసవకాలము డగ్గతి యుండ ని ట్లనున్. 218

ఉ. నా కుదయించుబిడ్డ యిది నాతుక గాక సుతుండ యేని న
స్తోకవివేక! యన్యపురుషుం డనఁగాఁ బడుఁ గాన వాని నా
లోకన సేయ నేను బరలోకము వొందెడుఁ బుణ్యభామినీ
లోకము నాథుఁ దప్ప నవలోకన మొం డొకమర్త్యుఁ జేసినన్. 219

గీ. ఇతరపురుషుని విన్నప్పు డేమి చెప్పఁ, జెవులు రెండును బుం డ్లగు జీవితేశ!
నిన్ను వినఁ జూడ వీనులు గన్నుదోయి, కలిగి తక్కినయెడ నవి వలవ దందు.

మ. అని తత్సన్నిధి నేత్రపట్టము దృఢం బై యుండ నయ్యింతి తా
ల్చిన నాథుండును నమ్మి భూగృహనివాసిత్వంబున న్మాన్చి యా
త్మనివాసంబున నిడ్డఁ బుత్రవతి యై తత్పుత్రు నెన్నండుఁ జూ
డనియాచారముతోడఁ బెంచెఁ దన నైష్ఠ్యం బెల్లవారు న్నగన్. 221

క. అంత నొక దివసమున గ్రా, మాంతరమునుండి వచ్చె నా గృహపతిపై
నెంతయుఁ గూరిమి గలమతి, మంతుఁడు తజ్జనకుభ్రాత మనుమనిఁ జూడన్.

ఉ. వచ్చి తదీయమందిరమువర్తన లెల్ల నెఱింగి యక్కటా!
సచ్చరితంబు గల్గుపతిచాడ్పున ముద్దతికంబు చూపుచు

గ్రమ్మచ్చిలి రాత్రు లీజఱభి మూఁడుజగంబులు గ్రింగుచుండె వె
ల్వొచ్చక యున్న నా కొడుకు బోఁ డెఱుంగునె దీని చెయ్దముల్. 223

వ. అని మఱియు నాత్మగతంబున. 224

సీ. మగనివా రెవ్వరు మందిరంబున . లేక జవ్వనంబునఁ దనచనవ యైన
నెల్లకాలముఁ బుట్టినిండ్లన నిల్చిన యాత్రోత్సవములకు నరుగుచున్నఁ
బని లేక పొరుగిల్లు పలుమాఱు ద్రొక్కిన మగవానితో గోష్ఠి మానకున్నఁ
జెడ్డయింతులతోడి చెలిమి యొనర్చిన వరుఁడు ప్రవాసైకనిరతుఁ డైన
గీ. విభుఁడు కొనటివాఁ డైనను వృద్ధుఁ డైనఁ
దన్ను మెచ్చక యొక్కఁతెఁ దగిలె నేని
బచని కాఁ డేని నెప్పుడుఁ బరుస నైనఁ
జెడక తక్కదు ధర నెట్టిపడఁతి యైన. 225

వ. అట్లు గాక. 226

క. వృద్ధునకుఁ దరుణి యమృతము, వృద్ధుఁడు దరుణికి నసహ్యవిష మూహింపన్
వృద్ధకుఁ దరుణుం డమృతము, వృద్ధయుఁ దరుణున కసహ్యవిష మూహింపన్.

క. అని తలపోయుచు నేకత, మున నతఁ డొకనాఁటిరేపు పుత్రుఁడు గ్రామం
బునపొంత చేనియొద్దకుఁ, జని యుండఁగ నచటి కేఁగి సముచితభాషన్. 228

వ. కొన్ని యాడి తదనంతరం బి ట్లనియె. 229

క. నీయంగన కపటాచా, రాయత్తము మాకు వెడల నాడుట తగదే
యీయున్నరాత్రులంద త, దీయవ్యాపార మేము తెలిసితి మెల్లన్. 230

క. కడు నమ్మక యున్నను నె, క్కుడు నమ్మినఁ జెడుట నిజము గోతులఁ జిన్న
ప్పుడు నమ్మక భూగృహమున, నిడ నేటికి నిప్పు డేల యిటుగా నమ్మన్. 231

క. పొడమదు చేయనికార్యము, పొడమక యుండంగఁ గప్పిపుచ్చెద మన నె
న్నఁడు రాదు సేయుకార్యము, వెడమాయపుమనుజు లేల వేల్పుల కైనన్. 232

క. అతులైశ్వర్యఘనుఁడు సం, తతయజనుఁడుఁ గామరూపతాఘనుఁడు బృహ
స్పతిసఖుఁ డన వెలయుదివ, స్పతిచేఁతయు మున్ను బయలుపడియెన కాదే. 233

క. పుత్రస్నేహము నట్టి క, ళత్రముపైఁ గూర్మియును దలంపక దానిం
బాత్రము చేయుము కినుకకు, గోత్రము వోనాటవచ్చుకొఱకే భార్యల్? 234

వ. అని యిట్లు పలికి. 235

క. ఊరికిఁ బోయెద మే మని, పూరితబాష్పాక్షుఁ డగుచుఁ బోయిన విప్రుం
డూరక యొకవడి నిలిచి య, గారంబున కేఁగి లజ్జ గదిరినమదితోన్. 236

క. దూరగ్రామంబునఁ బని, పే రొక్కటి చెప్పి కపటపేశలమృదుభా
షారసమునఁ దేల్చి గృహ, ద్వారము వీడుకొని పోయి తగునోలమునన్. 237

మ. పగ లెల్లన్ వెలి నిల్చి రాతి రరు దౌభంగిన్ స్వగేహంబున
ట్టుగమీఁదన్ వసియించి భార్యపయి దృష్టుల్ నిల్పి యుండంగఁ బ్రా
ద్దగుడుం గంజిమడుంగు పేర రజకుం డత్యాస్థ నేతెంచిన
న్మృగరాజేక్షణ లోచనావరణము న్వేగంబుతోఁ బుచ్చుచున్. 238

క. తలుపుం దాన వెసం జని, బలువుగ నిడి వచ్చి యింటఁ బ్రభు వేవంకన్
మెలఁగునొ యనియెడుతలఁపున, నలుదిక్కులు నూచి జారనాతుక ప్రీతిన్. 239

క. కదియఁ జనుదెంచి కౌఁగిటఁ, గదియఁగ నందంద పేర్చి కామాతుర యై
సదనములోనికి ర మ్మని, తుద చేఁ దిగుచుచును వానితో ని ట్లనియెన్. 240

ఉ. నీకొడు కూర లేఁడు మది నిర్భయ మొందుము వాఁడు గ్రమ్మఱన్
రాకయు నచ్చటం బదిదినంబులు వోయినఁ గాని లేదు రా
గాకులచిత్త నైనను నక్కఱ వో రతికేళిఁ దేల్పు ర
మ్మా కుడువంగ నీకు నని యట్టులు వండినదాన వేఁడిగాన్. 241

క. అని భోజ్యంబులు శీఘ్రం, బున నిడి తనయర్ఘ్యపళ్యమున నిద్దఱుఁ బొ
త్తునఁ గుడువఁ జూచి విస్మయ, ఘనలజ్జాక్రోధదుఃఖగతమానసుఁ డై. 242

గీ. బ్రాహ్మణుఁడు మందిరాంతరప్రాప్త మైన
యచటియట్టువ దిగి తనయంగణంబు
వెడలి యారెకులను దెచ్చి వేగఁ బట్టఁ
బనిచి యిద్దఱ నొప్పించె జనవిభునకు. 243

క. ఊరిప్రజ లెల్ల నత్యా, చారం బనఁ బరఁగుకులటచరితము లహహా
యారూఢతఁ జెప్పికొనఁగ, భూరమణుం డర్హదండమున నుగ్రుం డై. 244

క. ఇరువుర దండించె మహీ, సురుఁడును దనయాలిచెద్ది సొలయుట భార్యాం
తరమును బొందఁగ నొల్లక, విరతుం డై యరిగె జాహ్నవికి నతినిష్ఠన్. 245

వ. అ ట్లగుటం జేసి. 246

క. అత్యాచారపుమాటలు, నత్యంతస్తుతులుఁ గల్ల లగుట వినవె సాం
గత్యాన కేల నమ్మెదు, ప్రత్యక్షక్రూర మైనపామువచనముల్. 247

క. మావాక్యంబులు వొందవు, నీవీనులఁ దగినవారినీతివచనముల్
భావింపనివారలపై, దైవంబును నలుగు నింత తథ్యము చుమ్మీ. 248

క. అని పలికి యభిజ్ఞుఁడు మా, ననియతుఁ డై యూరకుండెఁ దక్కినవా ర
ట్ల నిలిచి రప్పుడు వెండియుఁ, దనుఁ బొగడిన మేను వొంగి తత్క్షణమాత్రన్.

క. ఉరగంబున కచ్చటు సొఱఁ
జెరు వెఱఁగించుటయుఁ జొచ్చి తెలిసి నీళ్ళ చె
చ్చెరఁ గ్రోలియుఁ జిఱుకప్పల
నెర గొనియును లావు వొంది యిచ్ఛానిరతిన్. 250

మ. భయదాకారతఁ జేర్చి దర్దురముల న్భక్షింప నానాఁటికి
న్లయముం బొంది దశాంశశేష మగుసేనం జూచుచు న్మంత్రులున్
బ్రియులుం జుట్టును నుండి దూఱ వినుచున్ భేకాధినాథుండు ని
శ్చయమానాధికచింతఁ బొందుచును బశ్చాత్తాపసంతప్తుఁ డై. 251

క. ఉండి భుజంగముఁ గన్గొని, మండూకకులంబు నెల్ల మడియించితి మి
త్రుండువలె నుండి తగునే, యొండొరులకుఁ గీడు సేయు టుచితమె మనలోన్.

చ. అన విని నవ్వుచు న్భుజగ మాతని కిట్లను నీప్రధాను లె
ల్లను గడుఁ బాపకర్ములు చలంబున నిన్నును నన్నుఁ బొంద నీ
క నయవిహీనబుద్ధు లయి కల్లలు ప్రేలిరి గాన వీంద్రను
న్మనిచిన నీకు నాకుఁ గలమైత్రి హరింతురు వక్రభావలన్. 253

క. అని పలికి దాని యెదురనఁ
దనుఁ జొఱనీ కడ్డువడినతన్మంత్రుల నె
ల్లను ద్రుంచి యంతఁ గతిపయ
దినములలో మ్రింగ నొకఁడు ద్రిక్కక యుండన్. 254

వ. అప్పుడు. 255

మ. తనవా రెల్లరు వోవ నొంటిపడి భీతస్వాంతుఁ డై బొక్క మా
టున మో మర్ధము దోఁప నున్నతని మండూకాధిపుం జేరి యి
ట్లనుఁ బా మక్కట! యేను నూతిదరి దాహం బొంది కూపెట్టఁగా
నను రప్పింపవు నీవు రాజ్యమదఘూర్ణం బైనచిత్తంబుతోన్. 256

క. ఈజలముపట్టె చూడ మ, హాజగ మఁట కప్పప్రువ్వ లఁట యందుఁ బ్రజల్
పూజింప వాని కెల్లన్, రా జఁట యొకకప్ప యట్టినగవులు గలవే. 257

వ. అని యిట్లు సాహసంబుతోఁ బలికి యాభయదర్శకంబు మఱియును. 258

క. నీపెరిమెలు నా కిప్పుడు, నూపెదవే నగరిలోను జొచ్చి యనుచు నా
టోపముతో భేకంబును, వాపోవఁగఁ గఱచి చంపి వడి గ్రహియించెన్. 259

వ. కావున. 260

క. బలియుం డగుపగతున కెడ, గలిగి చన న్వలయు వాఁడు కార్యముకొఱకై
కలయఁగ వచ్చిన బేల్పడి, కలిపికొనఁగ వలదు బుద్ధి గలిగినమనుజుల్. 261

క. అని యిట్లు సుమతి యెఱిఁగిం, చినకథ విని చాల సంతసిల్లి యిరువురుం
గొనియాడి రప్పు డాసఖిఁ, గనుఁగొని సుకుమారి కనియెఁ గడు నెయ్యమునన్.

క. ఏకాధివాసమైత్రిం, జేకొను మేఖలకు హితము చెప్పుతలఁపునన్
బోకుము నీ వెన్నఁడు నది, కైకొనదు హితోక్తి తెలియఁగా లేదు మదిన్. 263

క. అపగతవివేకులకు హిత, ముపదేశించుటయు వారి నొందుటయును నీ
తిపరుల కొప్పదు విహగము, కపిసహవాసమునఁ బడినకాఁటియ వచ్చున్. 264

వ. అక్కథ యెట్లనిన. 265

క. కానన మొక్కట బహుఫల, సూనక మొకభ్రమాన నొక్క సూచీముఖము
న్వానరమును దమలోపల, నూనిన నెయ్యమున నుండ నొకనాఁటినిశిన్. 266

క. మిన్నెల్ల నీలమేఘ, చ్ఛన్నం బై యొక్కవాన సాంద్రజలం బై
మున్నుగురిసి తుదినీఁదయు, సన్నపుఁజినుకులును విపినచరబాధలు గాన్.

వ. ఎడతెగక యున్నసమయంబున వానరంబు చెలి యగునగ్గిజిగాఁ డొకనాఁడు.

చ. మిడుఁగుఱుఁబుర్వు వెన్ను తగుమృత్తికపాదున నంటఁ జేసి యొ
క్కడ నఱలోన నిడ్డ నది యుమ్ములఁ గ్రాలెడురూపరేఖ గాఁ
దడియనిగూటిలోనఁ బ్రియదారయుఁ దానును నుండి సీతునం
గొడుఁగుర వోయి యున్నసఖుఁ గ్రోఁతిఁ గనుంగొని చాలఁ గుందుచున్. 269

వ. నీడద్వారంబునకుం జనుదెంచి యతనితోడ. 270

క. వడఁకెడు గదయ్య వానకు, నుడుకువ లేదయ్యె రాత్రి యుగమును గా క
న్నఁడు వేగునె యెవ్విధమున, నుడుగు న్నీబాధ యెట్టు లూరక నిలుతున్. 271

క. ఎడ లేదు నిన్ను రమ్మనఁ, గడు సన్నము నాగృహంబు కపివర! పెక్కా
డెడి దేమి యిట్టిపుట్టుగు, పడసినపుడ కాదె నాదుపౌరుష మడఁగన్. 272

ఉ. మచ్చిక రెట్టి గాఁగఁ దనమందిర మొంది యభీష్టవస్తువుల్
నెచ్చెలు లెల్లఁ బొంది సుఖలీలఁ జరింపఁగఁ జేయ లేమికిన్
వెచ్చనియూర్పు నించికొని విన్నఁదనంబును బొంది నెవ్వగ
న్వచ్చినయట్లు సజ్జనుఁడు వేఱొకదుర్దశచేత నొచ్చునే? 273

క. ఓర్వం డెఱుఁగక యుండఁగ, నోర్వం డెఱుఁగంగఁ జూడకుండఁగ నోర్వం
డోర్వఁడు సూడఁగ సుజనుం, డుర్విం దనవారి కైనయొప్పము లెందున్. 274

వ. అని తగుమాట లాడి పెద్దయు వగచి మఱియు నప్పక్షి యి ట్లనియె. 275

గీ. కాలఁ జేతఁ జేద గావు నీయట్టివాఁ, డకట! యుండఁదగినయాలయంబు
మున్ను జేసికొనని మోసాన నీపాట్లు, పడఁగ వలసె నిపుడు నడికిరేయి. 276

క. అని పక్షి హితము సెప్పిన, విని వెంగలి యైనక్రోఁతి వీఁ డిరవున నా
లును దాను నుండి న న్నొక, పిసుఁగుం గాఁ దలఁచి కాదె ప్రేలఁ దొడంగెన్.

క. తనయింట దివియ యుండఁగ, నను గాయు మనండు నెగడి నాతోఁ గొఱమా
లినమాటల నిసు మంతయుఁ, గొనకుండఁగ నాడె నిట్టికుటిలుఁడు గలఁడే?

చ. తన కఁటె యిల్లు గల్గె నఁటె తా దొర నా కఁటె యిల్లు లేదు! న
న్నునఁ గడుఁ గ్రొవ్వె నీపులుఁగు పుచ్చెద దీనిమదం బటంచుఁ జె
ళ్ళునఁ దరుశాఖ విర్చి కపి యచ్చటిచేరువఁ బల్వలోదకం
బునఁ బడ వైచె నంత వెఱ పుట్ట ఖగాంగన గూయుచుండఁగన్. 279

వ. అప్పుడు. 280

క. తడిసినయెఱకలు నీళ్ళం
బడి బెగడినమనసు గలుగుప్రాణేశ్వరి న
య్యెడ నుడిపి తెచ్చి యొండొక
యెడకుం గొని యేఁగి పక్షి యిమ్ముల నుండెన్. 281

క. కావున వివేకహీనుల, త్రోవం బోవలదు వారితోడి చెలిమి దా
నేవెంట నైన నాపద, గావింపక పోదు సుమతికలితుల కైనన్. 282

క. ధర దుష్టసఖులగుణములు, వెరవున నేమేనిఁ జేయ వేచుట తప్పాల్
పురిగొలుపుట మర్మాంతర, పరిహాసము సేయుచునికి పంకజవదనా! 283

వ. అని సుకుమారి యెఱింగించినకథ యిరువురుం గొనియాడి రప్పుడు మకరందిక
యి ట్లనియె. 284

క. ఇమ్మగఁ జెలిమి యొనర్చినఁ, గుమ్మరిపుర్వులవిధంబు కుజనులు చూడన్
సొ మ్మెత్తురు తుదిముట్టినఁ, ద మ్మెత్తురు నీతిపరులు తగుమిత్రులకున్. 285

వ. అని మఱియు ని ట్లనియె. 286

గీ. బుద్ధి మాలినకపి యొకభూమిపాలుఁ
జంపె హితుఁ డయ్యు; నొకదొంగ శత్రుఁ డయ్యు
విప్రు నొక్కనిఁ గాచె వివేకి యగుట
సుమతిపగ మేలు విమతినెయ్యమునకంటె. 287

వ. అది యె ట్లనిన. 288

క. మందరపురిఁ గాంతాజన, కందర్పుఁడు గలఁడు రాజు ఖగవృత్తిసమా
ఖ్యం దనరి బుద్ధిమంతులఁ, జెందఁడు సాక్షరుఁడు గాఁడు శిశుకాలమునన్. 289

క. గర్వోద్ధతచాపలమున, దుర్వర్తనుఁ డైననృపసుతునిచే నిడుమల్
సర్వము గని తన్మంత్రులు, దుర్వారాసహ్యబహులదుఃఖాన్వితు లై. 290

వ. ఆత్మగతంబున. 291

సీ. అక్షరజ్ఞుఁడు గానియతనికి శాస్త్రపురాణాగమాదులు రావు సారెఁగ
గ్రంథాధిగమశక్తి గలుగక శుద్ధవివేకంబు లేదు వివేకశుద్ధి
కలుగక కర్తవ్యకర్మ మెఱుంగఁడు కర్తవ్య మెఱుఁగక కడఁగి చేయు
క్రియల నీఁగఁగరానికిల్బిషంబులఁ బొందుఁ బాపుండు నరకకూపమునఁ ద్రెళ్ళు

గీ. నరకవాసి వేదనఁ దగుఁ బేద యై, కడుపుకొఱకుఁ బాతకములు సేసి
కౌరవమునఁ గూలుఁ గ్రమ్మఱ నట్ల యా, పదల కెల్లఁ గుదురు చదువులేమి.

వ. అని చింతించుచుండ నక్కాలంబున. 293

సీ. ఎలుకవేఁటలవేర నేఁగి పట్టణము బోఁ బ్రజలయిండులు కూలఁ ద్రవ్వఁ బంపుఁ
జెలఁగి డేగలకుఁ దొండల నేయఁ బోయి ద్రాక్షామంటపంబులు గాసి సేయుఁ
గోడిపోరులవేర వాడలఁ దిరుగుచుఁ బాడఁగన్నకడవలఁ బొలియ వైచు
వేఁటకుక్కలఁ దెచ్చి విడిచి మందలలోని మేఁకల కుసికొల్పి మెచ్చి యార్చుఁ

గీ. గాలకింకరులట్టి కింకరులతోడఁ
గూడి రాఁ గూడి ప్రొద్దునఁ గుడుపు దొరఁగి
వెడఁగుఁదనముఁ బ్రల్లదమును వేనవేలు
మదముతోఁ జేయుచును రాకుమారుఁ డిట్లు. 294

క. ఊరులును బోనులు గూళ్ళును, బరుసనిచెద్దములు గాలిపడగలు బొరిఁ గిం
కరులం బొడిపించెడి యా, సరభసములు దక్క నొండు సైఁప వతనికిన్. 295

క. ఆనరపతి యనువుగ నొక, వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతో
దానిఁ బెనిచి యాయుధవి, ద్యానిపుణతఁ బొందఁ జేసి యది వర్ధిలుడున్. 296

క. కంచుకము దొడిగి కుండల, చంచత్కటకాతివేషచయ మీడి శితఖ
డ్గాంచితరూపముతోఁ దన, కంచుకి యై యుండఁ బనిచెఁ గదలక యెపుడున్.

సీ. ఆరాజు మందిరోద్యానంబునకు నేఁగి యొకనాఁడు తాను బయోజముఖులఁ
దడవుగాఁ గ్రీడించి యొడలు నిద్రాలసం బగుటయు నందఱ నచట నచట
వసియింపుఁ డని పంచి వనచర మొక్కఁడ తోడ రా దట్టంపుసీడ నిలిచి
పరిమళమృదుశీతపవనంబు సెల వైనగురివెందపందిరి గుజ్జుసెజ్జ

గీ. సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను
డాయ వచ్చినజీవుల వేయు ఖడ్గ
ధారఁ దునియంగ నని చెప్పి కూరె నిద్రఁ
గపియుఁ బని పూని భూపతిఁ గాచి యుండె. 298

వ. ఆ సమయంబున. 299

మ. సుమనోదామము రాజుకంధరమునన్ శోభిల్ల నత్తావికై
భ్రమరం బొక్కటి మూఁగ దానిఁ గని కోపవ్యగ్రమై క్రోఁతి ఖ
డ్గమున న్వేసినఁ దేఁటితోన ధరణీకాంతావతంసంబుకం
ఠము రెం డయ్యె వినీతుఁ డైనపతిచేష్టల్ చేటు దే కుండునే? 300

వ. వివేకి యైనచోరుండు శత్రుం డైనవిప్రుం గాచినవిధం బె ట్లనిన. 301

గీ. నందినీనామనగరంబునందుఁ గలఁడు
బంధుకుం డనియెడునొకబ్రాహ్మణుండు
ధనికుఁ డఁట తొల్లి యవిలంఘ్యదైవఘటనఁ
బిన్న లై పుత్రు లుండంగఁ బేదవడియె. 302

వ. అప్పుడు. 303

మ. కటిబద్ధాంబరఖండమృత్పటలికాక్రాంత స్తనోపాంతికన్
జటిలాపింగళకేశభారఁ బ్రణితోష్ఠద్వంద్వ దీనాననన్
గటకస్థానపరీతరజ్జువలయం గాత్ర స్తమాలీన ను
త్కటబాష్పాక్షుఁడు సూచె బంధుకుఁడు దుఃఖవ్యూహినిం గేహినిన్. 304

వ. అట్లు చూచుచు నాత్మగతంబున. 305

మ. బలవద్దైన్యము వక్త్రిగహ్వరము గాఁ బల్చెట్లఁ గొన్నట్టియ
ప్పలు మైచాఱలు గాఁగ బాలరుదితంబు ల్మ్రోఁగుట ల్గాఁగ దు
ర్నిలయారణ్యములో భయప్రకరమూ ర్తిక్రూర మై యుండఁగాఁ
దలమే వెల్వడఁ జేయ లావుకలిమిన్ దారిద్ర్యశార్దూలమున్. 306

ఉ. ఐనను దీనిఁ బాపఁ దగుయత్నము చేసెదఁ గాక చిత్రప
ర్ణీనగరంబులో గుణగరిష్ఠుఁడుఁ బూర్ణధనుండు నై మదీ
యానుజుఁ డున్నవాఁడు విపులాఖ్యుఁడు వానికి సొమ్ము గల్గఁగా
నే నిటు బీద నైనవిధ మిచ్చ నెఱింగిన వాఁడు కుందఁడే ? 307

వ. అతం డొసంగుకనకము గొనివచ్చి యిచటం గర్షకుండ నయ్యెద. 308

సీ. ఈలోక మింతయు నాలుగుపాళు లం దొకట భిక్షుకులు సోమకులు నొక్క
పాలు సేవావృత్తి బ్రతికెడువారు విద్యోపజీవికులును నొక్కపాలు
వ్యవహార మాడెడువారుఁ దస్కరులును నొకపాలు కర్షకు లొక్కపాలు
మొదలిపాళ్ళు మూఁడుఁ బిదపటిపాలిన యనవరతంబును నపహరించు
గీ. నపహరించియు నంతంత కవి నశించు
నపహృతం బయ్యు నది వృద్ధి నందుచుండు
గానఁ దగురాజు గలిగినఁ గరిసనంపు
జీవనముఁ బోల దొండొక జీవనంబు. 309

క. అని తలఁచి కదలి కతిపయ, దినముల ననుజపురి చేరి తెరువున డస్సెన్
దనువు మును పేద యై నలి, గినమానముకంటె మిగులఁ గృశ మై యుండన్.
మ. అనుజాగారముఁ జేర వచ్చిన నతం డల్లంతఁ దా నగ్రజుం
గని సందేహము నొందియున్ గమనరేఖామాత్ర శోధించి క
న్గొని కన్నీరునఁ బాదము ల్గడిగి సమ్మోదమ్ముతో నెత్తి దీ
వన డగ్గుత్తిక డింద నాతఁ డదిమె న్వక్షంబుతోఁ దమ్మునిన్. 311
వ. తదనంతరంబున. 312

క. విపులుం డగ్రజునకుఁ దగు, నుపచారంబులు ప్రమోద ముత్కటముగ ని
క్కపుభక్తిఁ జలిపి యాతఁడు, విపన్నుఁ డగు టతనిచేతఁ విని దుఃఖితుఁ డై.
వ. నిజపుత్రకళత్రసహితంబుగా నాతని నిష్టదేవతానిర్విశేషంబున నారాధించు
చుండ నొక్కమాసంబు చన బంధుకుండు తమ్మునితో నొకనాఁటిరాత్రి
యెల్లి యవశ్యంబునుం దనకుఁ బయనంబు సేయవలయు నని నిర్బంధించి
పలికిన నర్ధరాత్రసమయంబున నవ్విపులుండు దనయంగణంబునఁ దతపరిసాంద్ర
మాధవీలతాచ్ఛన్నం బగుచూతకుంజంబుక్రిందికిం బూర్వజుం దోడ్కొని
యేఁగి వేకువన యతనిపయనం బగుటఁ దన్నిమిత్తంబు లగుమాట లాడి. 314

క. కొనిపోవ రాదు తెరువునఁ, గనకము తెక్కలి ఘనంబు కాకున్నను మో
వను కాదు పెద్ద పేహామం, బని యన్నకుఁ దెలియఁ జెప్పి యకుటిలమతి యై.
వ. అనేకనిష్కసహస్రమూల్యం బగు నొక్కమాణిక్యం బతనికి బ్రమింగ నిచ్చి
మీరు ప్రభాతకాలంబున జీర్ణమలినాంబరంబులు ధరియించి యరుగునది యని
చెప్పి యిరువురు శయనస్థానంబుల కరుగుటయు. 316

క. వారలపలుకులుఁ దద్వ్యా, పారంబులుఁ దెలియ నెఱిఁగి ప్రమదహృదయుఁ డై
చోరుం డొకరుం డచ్చటి, భూరుహమున నుండి వారు పోయినవెనుకన్.

ఉ. కన్నము వెట్టఁ జన్న నొకకంచముఁ జీరయుఁ గాక యబ్బ దా
స న్నిలువం బ్రమాద మది చాలఁగ లాభము చేరె నాకు నే
నిన్నిశి వుచ్చి వేగుతఱి నిప్పటి విప్రునిఁ గూడి పోవుచుం
గన్నపువేఁట మాని మణిఁ గైకొని ధన్యుఁడ నై చరించెదన్. 318

వ. అని నిశ్చయించి యచ్చటు వాసి పోయి ప్రభాతం బగుటయు. 319

గీ. పయన మై పోవుబ్రాహ్మణుపజ్జఁ దగిలి
సాధువోలె నాతనితోడ సముచితంపు
భావ లాడుచుఁ దనచేయుపనికి నను వు
తలఁచికొనుఁ జోరకుండును దనమనమున. 320

క. నడుమ నలవడదు ముందటి
యడవిం దెగఁ జూతు విప్రు నని తలఁచుచు న
య్యడవి దరిసి యరుగఁగ న
క్కడఁ దెక్కలికాఱు వచ్చి కడు రౌద్రమునన్. 321

క. ఇరువురఁ గట్టియుఁ గొట్టియుఁ
బరిభవములు వెట్టఁ బేదపన్నల మనుచున్
గరుణముగఁ బలుకఁగాఁ గృప
యొరగినచిత్తముల వార లొండొరుతోడన్. 322

క. ఈ యొడళుల కీకోకలు, వే యైనను దగవు కపటవేషము లివి యీ
మాయలకు మనకు లేవె యు, పాయము చీఱుదము వీరిఁ బట్టి యుదరముల్.

వ. అనుచుండ నందులో ముఖ్యు లగువారు. 324

గీ. వ్రత్త మొకనికడుపు వ్రయ్యంగ నందులోఁ
బసిఁడి లేక యున్నఁ బరుని బ్రదికి
యరుగ నిత్తు ముండిన నైన నితరుని
వ్రత్త మిదియె కార్యవృత్త మనుచు. 325

వ. నిశ్చయించి తమ యిరువురిలోపల నొకని వధియింప నుద్యుక్తు లగుసమయం
బునం జోరుం డాత్మగతంబున. 326

క. ఏ నేమి తలఁచి వచ్చినఁ, దా నేమి తలంచె నిచట దైవం బవురా!
తా నొక్కటి తలఁపఁగ విధి, తా నొక్కటి తలఁచు ననుట తథ్యం బయ్యెన్.

క. పావనుఁడు బ్రాహ్మణుం డని, భావింప క కారణముగఁ బాపాత్ముఁడ నై
యీవిప్రుఁ జంపఁ దలఁచితి, నావిధి యి ట్లుండ నట్లు నా కే లబ్బున్?

ఉ. ఒప్పమి సేయఁ డేనిఁ దగు నుత్తమవంశజుఁ డేని నేరికిం
ద ప్పొనరింపఁ డేని నతిధార్మికుఁ డేని దురాత్ము లైనవా
రప్పురుషావతంసమున కాఁడి యొ గ్గొనరింపఁ జూచినం
దప్పనె చేటు వారలకు దైవముకన్నులు పుట్టుఁజీకులే? 329

గీ. ఇతనికడుపు ప్రచ్చి యిం దిడ్డ రత్నంబుఁ, గాంచి రేనిఁ దనదుకడుపు ప్రత్తు
రురక చంపి పోదు రూరక విడువరు, కడుపు ప్రచ్చు టెట్లు గట్టి తనకు. 330

వ. అయినను. 331

క. తనకడుపు మున్ను ప్రచ్చినఁ, గనకము లేకున్న నతనిఁ గాచెద రెట్లుం
దను విడువ రింక బహుచిం, తనములఁ బని యేల కాచెదం గా కితనిన్. 332

వ. అట్లుం గాక. 333

క. క్షీణకరుణచే బ్రాహ్మణు, ప్రాణముఁ గొనఁ దలఁచినట్టిపాపము మగుడం
బ్రాణంబుఁ గాచి యతనికిఁ, బ్రాణం బీకున్న నెట్లు పాయఁగ నేర్చున్. 334

వ. అని కృతనిశ్చయుం డై. 335

క. తన కడుపు మున్ను ప్రచ్చుం, డనుటయు నటుఁ జేసి వార లం దేమియుఁ గా
ననివా రై యీతని ప్రవ, చ్చిన నట్టుల కాదె యేల చెనఁటిగఁ జంపన్. 336

వ. అనుచు నవ్విప్రు బంధముక్తునిం జేసి నిజేచ్ఛం జను మనుటయు. 337

క. క్రూరులచే విడివడి సుత, దారాదులఁ గలసి యతఁడు ధన్యుం డయ్యెం
జోరుఁడు వివేకమానస, చోరుఁడు నాకమున కరిగి సుఖి యై యుండెన్. 338

క. అవివేకచరిత మట్టిది, సవివేకచరిత్ర మిట్టిచందం బగుటన్
సవివేకహీనుసంగతిఁ, దవులఁగ వల దాపదలకుఁ దప్పఁ దలఁచినన్. 339

వ. అని మకరందిక యెఱింగించినకథఁ గొనియాడి రిట్లు సుఖగోష్ఠి యొనరించి య
మ్మువ్వురు సముచితవ్యాపారంబులకుం జని రంత నిక్కడ. 340

శా. దేవీరత్నము కిన్కతోఁ జనిన ధాత్రీనాథుఁ డుల్లంబులో
నావిర్భూతమనోజతాపదహితుం డయ్యెం బరీహాసభా
షావిన్యాసముచే దినంబు గడపం జారాయణుం డేఁగి ని
ద్రావాసంబు భజించె రాజు కృతసంధ్యాముఖ్యకర్తవ్యుఁ డై. 341

ఉ. అచ్చటనుండి నేర్పు గలయట్టియనుంగుల యైనయింతులం
బుచ్చిన రాక దేవి తనబోఁటికిఁ దెల్లమి గాఁగ నిల్చినన్
వెచ్చనియూర్పు నించుచును వేదనఁ బొందుచుఁ గన్ను మోడ్చుచు
న్విచ్చుచు సజ్జపైఁ దనువు వెమ్మఁగ వేఁచుచు నీల్గి లేచుచున్. 342

సీ. ఉండె నంతకు మున్న యుర్వీశతిలకుపై దేవి తప్పులు వెట్టి పోవుటయును
రాత్రి దా సజ్జకు రాకుండుటయును జెప్పినఁ గళావతి నతిప్రీతితోడఁ
బసదనంబునఁ దన్ని భాగురాయణుఁడు లాటేశ్వరపుత్రిక నెసక మెసఁగఁ
గైసేయఁ బనిచి యక్కన్యాశిరోమణి నటకుఁ దోడ్కొని యేఁగునట్లు చేసి
గీ. వలయుబుద్ధులు సెప్పిన నెలమి నదియు
నీమృగాంకావలియు మున్న యెఱిఁగికొనిన
నెయ్యములకల్మి నోర్తోర్తు దియ్య మెక్కఁ
గూడికొని రహస్యక్రియాకుశల లగుచు. 343

ఉ. వర్జితలోభుఁ డాదిసచివప్రభుపాత్రుఁడు సద్వదాన్యతా
నిర్జితసూర్యసూనుఁడు మనీషి జనస్తుతధర్మవర్తనుం
డూర్జితసంపదాఢ్యుఁడు పయోనిధిసప్తకబంధుకీర్తికిం
గర్జితదానవృష్టి కవిగాయకపోషకదృష్టి యిమ్మహిన్. 344

క. ఆజన్మవదాన్యుఁడు బహు, రాజసభావినుతకీర్తిరమణీరమణుం
డోజఃప్రధానకాంతి, భ్రాజితమృదుమధురకావ్యపరిణతుఁ డెందున్. 345

మాలిని— సరససుకవిగోష్ఠీసంభవానందచేత
స్సరసిజుఁడు కళావిజ్ఞాతసంగీతవిద్యా
భరతుఁడు ధృతివిద్యాభీమనామాత్యపుణ్యో
దరశరనిధిసంభూతప్రపూర్ణేందుఁ డుర్విన్. 346

గద్య—ఇది సకలసుకవిజనవిధేయ మంచననామధేయప్రణీతం బైన కేయూర
బాహుచరిత్రంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు

# కేయూరబాహుచరిత్రము

## చతుర్థాశ్వాసము



క. శ్రీవనితావాణీసుత, తావాసితకృతవిలోచనాననపద్మం
డావిష్కృతసుస్థిరధ, ర్మావర్తనుఁ డెలమి గుండనామాత్యుఁ డిలన్. 1

వ. భాగురాయణుఁడు మఱియును దనలోఁగిటినుండి నగరిలోపలి కరుగురాజమందిరోద్యానంబుచక్కటి కటమున్న యాయతంబు సేసిన దృష్టితెరువు గలుగుట నందుఁ బ్రవేశించి వసుధావల్లభు శయనగృహము స్తంభకుడ్యంబుల లోపల బయలై నయంత్రవిశేషంబులం గలయది యగుటయు నందలి యంత్రకీలంబులు దొలంగించు కడియించువెరవును నన్నికేతనంబునఁ బ్రవేశనిర్గమస్థానంబులును నందు సంచరించువిధంబులును నంతకు మున్న మంత్రిముఖ్యునిచేత విన్నది యగుటం గళావతి తానును నక్కన్యకారత్నంబును నయ్యంత్రంబున నక్కుడ్యంబులోపల సొచ్చి యొక స్తంభంబునొద్దకుం జని యది కేయూరబాహుమహేశ్వరు నిద్రాగారం బగుటయు నందు నిద్రించినవాఁ డతం డగుటయుఁ జెప్పి యేను నిన్ను స్తంభంబుపార్శ్వంబు వెలువరింప వెడలిపోయి యున్నిలయంబులోపల నానరేంద్రమన్మథుండు మేలుకొనునంతకు ననతిదూరంబున నుండి యతఁడు బోధంబుఁ బొంది నిన్నవలోకింప భవదభీష్టంబు సిద్ధించుకొఱకు నీమనంబున నతనిం బ్రసవశరాసనుం గాఁ దలంచి నిన్ను రతీదేవిగా నిరూపించుకొని యఱుత నున్నయుత్తారహారంబు నమస్కృతవచనపూర్వకంబుగాఁ దత్కంఠంబునం బెట్టి కరగ్రహణంబు సేయ నర్థించె నేనియు నీవు రత్నసుందరికి వెఱతు నని పలికి తప్పించుకొని యతిత్వరితగతి నేతెంచి యిచ్చటు సొచ్చునది యని తెలియ నెఱిఁగించి యాసదనాభ్యంతరంబునం బొందునట్లుగా వెలువరించిన. 2

గీ. మెలపుమై నాతితోఁ బొలయలుక గూరి
కను మొఱఁగి వచ్చి నిద్ర యేకతమ చేయు
చున్నప్రద్యుమ్నుచాడ్పున నొప్పువాని
సుప్తుఁ గేయూరబాహునిఁ జూచెఁ గన్య. 3

చ. వినుకలి మున్ను గీల్కొనిన వేడుక చూపుల కర్థి చేయఁగాఁ
గనుఁగొని యన్నరేంద్రవరకన్యక నిద్రితుఁ డైనభూపతిం
గనుఁగవ ఱెప్ప వెట్టనివికాసము నెక్కుడు వేడ్కతోడ నె
మ్మనమునఁ జోద్యముం బొదల మన్మథుఁ డుద్ధతిఁ జాప మెక్కిడన్. 4

ఉ. ఆరమణీలలామ హృదయంబున నాదట లంతకంతకుం
బేరఁగ నింపు సంతసముఁ బెంపు వహింపఁగ ఱెప్ప వెట్టఁగా
నేరుపు లేక వేడుకలు నిట్టలఁ ద్రోసెడువాలుఁగన్నుల
న్వారణ లేక క్రోలె జనవల్లభసుందరు మేనిచెల్వమున్. 5

వ. అట్లు సూచుచు నాత్మగతంబున. 6

సీ. ఈఱెప్పపొది విచ్చి యించుక సూచిన
నొప్పారుకన్ను లెట్లుండు నొక్కొ
యీబొమ లల్లార్చి యెత్తి నటించిన
నలిక మేసొబగునఁ బొలుచు నొక్కొ
యీముఖాంబుజమున నెలనవ్వు మొలచిన
నరుణాధరం బెంత యమరు నొక్కొ
యీవాక్కు తెఱచి యే మేనియుఁ బలికిన
మృదుభావ మెట్టిదై మెఱయు నొక్కొ
గీ. యనుచు నరనాథపుత్రిక మనములోన
మదనవికృతు లంతంతకు నుదిలకొనఁగ
వేడుకలు మెచ్చులును జోడు గూడి పొదల
ధరణినాయకు చెలువంబుఁ దగిలి పొగడె. 7

వ. మఱియును. 8

సీ. పూర్ణలలాటసముల్లాసవదనంబు నాననాంబుజముతో నంటఁ జేయ
సామజకుంభసంస్ఫాలనకర్కశహస్తంబు చన్నుల నంటుకొనఁగ
జ్యాకిణవ్యాయితచారుబాహులు కాంక్ష రెట్టిగా గళమునఁ జుట్టుకొనఁగ
రాజ్యలక్ష్మీమందిరప్రాంగణం బైనవక్షస్స్థలంబున వ్రాలి సోఁగియ
గీ. నప్పళించుఁ దివురు నట్టాడు మదిలోన, మాన మూఁది తన్నుఁ దాన మగుడఁ
దిగుచు రాజకన్య జగదీశసుందరుం, జూచి చూచి మదనుఁ డేఁచి యలఁప.

వ. తదనంతరంబు. 10

చ. ధరణితలేశ్వరుండు వెడ తాల్చిననిద్రఁ దొఱంగి కన్నదో
యర విరియంగ లాటవసుధాధిపపుత్రికఁ జూచి రత్నసుం
దరి చనుదెంచెఁ గాఁ దలఁచి తప్పక కన్గొని కాక యున్న న
చ్చెరువును సందియంబుఁ దనచిత్తములోపల సందడింపఁగన్. 11

చ. ప్రకటితదేహదీప్తులు విభాసితభూషణదత్తదీధితి
ప్రకరముమీఁదఁ గ న్నెగసి పార్శ్వములం బచరించి చుట్టుఁ బ
ర్వికొనఁగ వెల్గుచుండుపరివేషములోపల నొప్పుచంద్రరే
ఖకు సరి యైనలాటనృపకన్యకఁ గాంచె విభుండు భ్రాంతితోన్. 12

ఉ. చూపులు మేన నంతటను సోఁకినచోటన నిల్చెఁ జెల్వపుం
దీపులు గ్రోలఁ గోరికలు దీఱినవీనులు మంజుకోమలా
లాపరసామృతంబును దలంబుగ నింపుల కాస సేయ న
భ్భూపతి లాటభూమిపతిపుత్రికయొప్పునఁ జిక్కెఁ దద్దయున్. 13

క. నిగుడుచు మగుడుచు నుండెను
మగువమెఱుఁగుఁజూపుగములు మగుడక పటలం
బుగ నందు విభుని చూడ్కుల
తగులున నొండొరులమీఁద దలముగఁ బర్వెన్. 14

వ. ఆసమయంబున. 15

చ. అసదృశతారమౌక్తికసమంజసనాయకరత్నమై సమం
జసరుచిపుంజమై తనకుచంబులమీఁద వెలుంగుహారముం
బిసరుహహస్త పుచ్చుకొని పెట్టెఁ బ్రియంబునఁ జేరి 'తే నమః
ప్రసవశరాసనాయ' యని పల్కుచు భూపతికంధరంబునన్. 16

వ. అప్పుడు. 17

మ. కరమూలంబున మించుఁబొంచు లిడి కాంతుం గ్రోలుఁ గప్పారుముం
గురు లర్థింగ బళించు వాతెరమెఱుంగు ల్దొద్దలాడుం బయో
ధరకుంభంబుల నెక్కు డిగ్గు మెలుపొంద న్నివి కర్గుం దలో
దరినాభీనవదీర్ఘికం బొలుచు నద్ధాత్రీశుచూడ్కు ల్వెసన్. 18

చ. ఎలుఁగు వినంగ నుబ్బి కమలేక్షణచేతుల సొంపు గాంచి స
ల్లలితశుభాంగకంబుల విలాసము లాదట వోవఁ గ్రోలి దే
హలతిక గంధ మూని యిటు లన్నియుఁ బండువు సేసె నిద్రియం
బు లొకఁడుఁ దక్కకుండ మది భూపతి కేఁకట నొందుచుండఁగన్. 19

క. ఆ సమయంబునఁ బుష్పశ, రాసనుచే నలసి తగవు నవుల జరపుచున్
దా సజ్జ డిగ్గి ధైర్య, వ్యాసంగం బెడలి నృపతి యతివ దరియుచున్. 20

ఉ. ఎవ్వరిదాన వీవు హరిణేక్షణ! యెయ్యది నీకుఁ బేరు ని
న్నెవ్వతె దెచ్చెఁ జెప్పు మిది యేర్పడ బంటుగ నన్ను నేలు మం
చవ్వసుధేశ్వరుం డతివహస్తము వట్టినఁ బట్టి ధైర్యమున్
ద్రవ్వెడుకన్నులం గొని యదల్చి వదల్చెఁ గరంబు చయ్యనన్. 21

వ. ఆలోన మఱియును. 22

గీ. రత్నసుందరి కోడుము రాజ! నీవు
వలదు మమ్మేల పట్టెదు తొలఁగు మనుచుఁ
గంబ మది సొచ్చి జంత్రంబుఁ గదియఁ దిగిచి
యబ్జవదన యదృశ్య మైచట్లు వోయె. 23

క. అప్పుడు నరపతి యిప్పటి, యప్పడఁతుక యెందు వోయె నాశ్చర్యం బీ
చొప్పు కలయొ నిజమొ యనుచు, లెప్పం బయ్యెను మదనుశిలీముఖములకున్.

వ. అంత. 25

సీ. లెక్కింపఁ జులుకనై చుక్కలాకసమునఁ బ్రాఁతముత్తియములపగిది నుండ
నొదవెడుకెంజాయ నుదయాచలముమీఁద మాణిక్యవేదితో మచ్చరింప
నాకాశనదిక్రేవ నమృతభానుఁడు మేనిమించుఁ గోల్పడి ముదియంచఁ బోలఁ
జలిగాలిసోఁకునఁ దెలిసి కొండొకవడి కవలెల్ల జక్కవకవలఁ బెరయ

గీ. వెలరువాఱుచు గృహదీపవితతి యొప్పె
విరులపై నళులు గోరంటవిరుల దొరయ (?)
నలినములు కుముదముల నవ్వ నలుదెసలను (?)
జాలఁ బెరయంగఁ బ్రత్యూషవేళ యయ్యె. 26

చ. జలజవనంబుకూర్మిచెలి జక్కవదోలముదంబు నిక్కుచు
క్కలపయి దాడికాఁడు త్రిజగంబుల మ్రొక్కులయిక్క వేదము
ల్మొలచినపాఁదు యోగులకు మోక్షమువాకిలి ప్రాణికోటికి
న్వెలుఁగ గన నొప్పునవ్వెలుఁగు వేగమ తూర్పునఁ దోఁచె నత్తఱిన్. 27

వ. త్వరితకృతప్రాతరుచితవర్తనుం డై యేకతంబ యుండి. 28

క. భయభక్తిసమేతంబుగ, జయశబ్దము మున్నుఁ గాఁగఁ జనుదెంచినయా
ప్రియసఖుఁ డగుచారాయణు, నయనము లారంగఁ జూచి నరపతి పలికెన్. 29

క. ఈరేయి వేగుఁబోకటఁ, జారాయణ! యేమి చెప్ప జను లెన్నఁడు నె
వ్వారును నెచ్చటఁ గానఁగ, నేరనిచోద్యంబు గంటి నిక్కము వినుమా. 30

సీ. చైతన్య మొందినచక్కనిచిత్రంబు చిఱునవ్వు మరగినచిగురుబొమ్మ
నడుపాడ నేర్చిననవకంపునునుదీఁగ మురిపెంబుఁ బూనినవిరులయెత్తు
వంక వాయఁగఁ బెట్టి వచ్చినక్రొన్నెల పలు కభ్యసించినపసిఁడిప్రతిమ
నిలుకడ వడసినతొలుకారుమెఱుఁ గర్థిఁ గైసేసి తోఁచినకామునలుఁగు

గీ. నాఁగ నభిరామ మగునెలనాఁగ యొకతె
మానవాంగనాసదృశంబు గానిరూపు
మహిమ గలయది నాసుప్తిమందిరమున
కేకతమ వచ్చి యుండఁగ నేను గంటి. 31

క. తరుణప్రవాళరుచిరా, ధర నవమాణిక్యపాదతల వజ్రలస
చ్చరణనఖ నీలకచ య, ప్పురంధ్రి కడు నొప్పు రత్నపుత్రికవోలెన్. 32

చ. మెలపున దాఁటి యాడుమగమీలవిలాసము దోలి వ్రాలి కం
దలవపుచాయ మీఱి వెలిదామరఱేకుల తెంపు నవ్వుచుం
గలువలకాంతి గైకొనక కాఱుమెఱుంగులఁ బోలి నేత్రము
ల్చెలువకు నొప్పు ముత్తియపుఁజిప్పలపాటికి నింత పెద్ద లై. 33

క. కమలానన కన్నులు ని, క్కమునకు దొనలోనఁ బొలుచుకామునిశితబా
ణము లగు న ట్లాకర్ణాం, తములును భ్రూచాపసంశ్రితంబులు నగుటన్. 34

ఉ. ఇంచుక నాపయిం బొలసె నిందుకరావళి ముంచి తెచ్చి పై
వంచినపోల్కిఁ బువ్వువల వైచినచాడ్పునఁ గల్వదండ సా
రించినలీలఁ దమ్మివిరి ద్రిప్పినభంగి మెఱుంగుఁదీఁగె గ
ప్పించినమాడ్కి వాలు జళిపించినకైవడి నింతినేత్రముల్. 35

వ. ఆ సమయంబున శయనతలంబున నాసీనుం డైననన్నుఁ గదియఁ జనుదెంచి.

చ. జలరుహగంధి తా మధురచారుసుధారస మర్థి నాదువీ
నులఁ జిలికించుచుం దనచనుంగవమీఁద వెలుంగునొక్కయు
జ్జ్వలతరహారవల్లి గరువంబున నామెడఁ జేరి పెట్టెఁ గో
మలకరపల్లవద్యుతిసమాజము మ త్తను వెల్లఁ బర్వఁగన్. 37

వ. అయ్యవసరంబున. 38

చ. తను నెఱుఁగం దలంచి ప్రమదంబునఁ బాణిసరోరుహంబు వ
ట్టినఁ గని రత్నసుందరికి డెందములో వెఱ తంచుఁ గోమల

ధ్వని నమఁ బల్కి కన్నుల నదల్చుచు నాదుమనంబుతోనఁ గ్ర
క్కునఁ దనహస్తముం దిగిచికొం చరిగన్ లలితాంగి మెల్లనన్. 39

క. అత్తటి వెనువెనుకన చన, నత్తరుణి యదృశ్య యయ్యె నచ్చెరువు వయ
స్యోత్తమ! యప్పటినుండియుఁ, జిత్తంబున సందియంపుఁజీఁకటిఁ బడితిన్. 40

చ. కల యగు నొక్కొ యొండె కల గా దిది నిక్కమ యొక్కొ నిక్కముం
గలయును బొత్తునం గలయఁ గ్రాఁగినచంద మొకో నిజంబుగాఁ
గల యగు నేని నున్న దిదె కంఠముహారము నిక్కమైన న
క్కలికి వెడందవాలుఁదెలిగన్నులసుందరి యేది ముందఱన్. 41

వ. అని యిట్లు మదనవికారభ్రాంతిపూర్ణస్వాంతుం డైనమేదినీకాంతుం గనుం
గొని సంతసిలుచు రత్నసుందరీసౌభాగ్యగర్వాపహరణక్రియాచింతైకపరా
ణుం డగునాచారాయణుం డాత్మగతంబున. 42

క. కానిమ్ము రత్నసుందరి, పై నిలిచినమనము కొంత పాఁతు గదతె నిం
కీ నరనాథుని నొండొక, మానినిదెస నెట్టు లైన మరగ ఘటింతున్. 43

వ. అని తలంచుచు నతనితో ని ట్లనియె. 44

మ. జగతీనాయక! యింత యేమిటికి నీసౌందర్యజాలంబునన్
దగులంబడ్డది దేవకాంత యయినన్ ధైర్యంబుపాం దేది లో
మగుడన్ వచ్చుట కేమి సందియము నామాట ల్మది న్నమ్ము మా
మగువం జూపెద నీకుఁ దత్సులభసంబంధంబు సంధించెదన్. 45

వ. అని యి ట్లచ్చుట నవ్విధంబునఁ జెల్లుచుండ నావల రత్నసుందరి మేఘలకుం
బ్రియంబు సేయుకొఱకు రాజు చారాయణద్వితీయుం డై యునికి విని యా
విదూషకుమీఁదియలుక నటు వోవక సపరివార యై నిజనివాసంబున నిలచె నిట
నద్దేవియాగ్రహంబ యనుగ్రహంబుగా సంతసిలుచు భూవల్లభుండు దానును
సఖుండును మందిరారామంబునకుం జనియె నట మున్న వసంతాగమసమయం
బగుటయు. 46

క. ఎడలెం గారాకులకై
వడి యై నూనములు పల్లవములవిధం బై
యడరెను రాగము పడఁతుల
యొడళులు లతలఁ బురుడించు టుచితమె యనఁగన్. 47

చ. వననివహంబు లెల్ల మృదువల్లుల నామృదువల్లు లెల్ల లేఁ
గొనలఁ దనర్చు లేఁగొనలు గుత్తుల గుత్తులలోఁ జిగుళ్ళు వెం

పొనరుచిగుళ్లఁ గ్రొవ్విరులు పూఁ దగుఁ గ్రొవ్విరు లెల్లఁ దేఁటులన్
మునుకొను తేఁటు లెల్ల నునుమ్రోఁతల నెంతయు నొప్పె నామనిన్. 48

సీ. మృదువేఁడికంటిక్రొవ్వడుపంగఁ జాలినకందర్పుమాఱటఁబొంది యనఁగ
నెలదీఁగె లనియెడునెలనాఁగలకుఁ బ్రీతి నర్తనంబులు సూపునటుఁ డనంగఁ
గళికల పరువంపుఁగన్నెఱికంబులు వెరవుతో నెడలించువిటుఁ డనంగ
వనమునఁ గ్రీడించువల్లభారమణుల సురతాంతమునఁ గోరుసురఁటి యనఁగ

గీ. నామనికిఁ బ్రాణ మనఁగ నుద్యానమునకు
సోబ గనంగఁ గొలంకులచుట్ట మనఁగ
నచ్చవెన్నెల నెచ్చెలి యనఁగఁ బొలసెఁ
జందనపుఁగొండఁ బుట్టినచల్లగాలి. 49

చ. సరసరతిశ్రమాన్వితభుజంగమనూతనపానకేళి ఝ
ర్ఝరితము లైనయమ్మలయశైలసముద్భవగంధవాహముల్
విరహిజనాననాబ్జముల వెల్వడుతోరపుటూర్పుగాడ్పులున్
బోరిఁబోరి నంతనంతఁ దముఁ బొందఁగ దట్టము లయ్యెఁ గ్రమ్మఱన్. 50

వ. మఱియుం దత్కాలంబున వికచారవిందవాసితగండూషజలంబు లొండొంటి
కిచ్చుశుండాలమిథునంబులకుం గ్రీడాలవాలంబు లగుకూలంబులుం గలిగి పెఱి
కినయెలదూండ్లు నఱికి చవిపట్టి ప్రియుల కొసఁగుచక్రవాకంబుల భాగ్య
పరిపాకంబులుం బోనిపద్మాకరంబులును నెడవెలుపు లేనిపూఁదేనియజడిం
దోఁగి యసమకాలపర్జన్యకాలశంక మత్తిల్లి నృత్యంబు సేయుమత్తకేకికేకల
కోడుభుజంగకుటుంబంబును వలసలు వోయినకతంబున రిత్త లైనగుప్తప్రేమ
భరపరితప్తంబు లగువనకేళిలోలబాలికాజనంబులకుం బరిరంభణయోగ్యంబు
లగుచందనతరుసందోహంబులును గుత్తులయెడ చిగుళ్ళు వలవంత వేఁడిమిం
బొరలుకాంతలయిగురుపాన్పులకుఁ గొట్టికత్తెలు పుడికినం దేఁటిదాఁటునకు
నెరసు లేకుండ నొడికంబుగా వడిపెట్టినతావికుప్పలుం బోలె నొప్పి పూచిన
యశోకభూజాతపోతంబులును సహకారకోరకాంకురములు గప్పునం గమిచి
మేసి క్రొవ్వునం బెచ్చుపెరిఁగి నోరంగొలందులు కూయుకోకిలదంపతుల
సందడికిఁ దొలఁగి మధురపక్వఫలంబులం బరితృప్తంబులై యెలమావిమోకల
మీఁద మూకలు గొనఁ బ్రాఁకినగురువిందపందిరుల గొందుల సందు వెడలి
తొరఁగినపూరేకుంబాన్పులఁ గలుగునీరంబులలోనఁ బ్రాణేశ్వరులయెఱకల
యిఱుకులం బారవశ్యంబు లూనఁ జంచులు సంచులమీఁద నిడి నిద్రించురా
చిలుకరాణివాసంబులు నగుచు నత్యంతమనోహరం బగుచుండ. 51

సీ. వలరాజువిజయకాహళనాదములభంగి సెలుఁగించుగండుఁగోయిలల క్రందు
చిత్తజుచాపశింజినులకై వడి మ్రోయుచంచరీకంబుల సందడియును
నంగసంభవుసేనయాన్పులవిధ మగుకలికిరాయంచలకలకలంబు
రతిపతిబలపదోత్థితధూళిచాడ్పున పెస లెల్లఁ గప్పెడుకుసుమరజము
గీ. పచ్చవిలుతునిగొడుగులపగిది యైన
యలరుమావిడిమోకల చెలువు పెంపు
నెమ్మనంబునఁ దాపంబు నిగుడఁ జేయ
సఖునిఁ జూచుచు నిట్లనె జనవిభుండు. 52

మ. కలయం బూచి వెలుంగుకింశుకము లంగారప్రతానంబు కో
మలసాంద్రాంకురభాసిచూతలతికల్ మంటల్ నభోవీథి న
గ్గల మై క్రాలుచుఁ దూలుచుం దిరుగుభృంగశ్రేణి ధూమంబు గాఁ
బొలిచెం బుష్పశరప్రతాపదహనంబో నాఁగ నిచ్చోటు దాన్. 53

వ. అనుచు నందు విహరింపం జాలక యొక రమణీయలతామందిరంబు సొచ్చి
యందలి చంద్రకాంతవేదిమీఁదం దనువు వైచి పొరలుచు నుండి కొండొక
సేపున కాసీనుం డై. 54

మ. తనకంఠంబునఁ గాంత మున్నిడినముక్తాహారముం బుచ్చి చే
త నమర్చుం గడుఁ బ్రీతిఁ గన్గొనుఁ గరద్వంద్వంబునం జేర్చు మో
మున నొత్తుం బలుమాఱు డెందమున మోపుం గ్రమ్మఱం గంధరం
బున బూనుం బరిరంభబుద్ధి మెయిఁ గప్పుం ధైర్యగస్వస్తికన్. 55

వ. ఇట్లతిబహుళం బగుకోరికలకు నెల వగుచుం దనలోనన యిట్లని తలంచు. 56

ఉ. ఏపున మున్ను వేడ్కఁ సుఖియించి సముద్ధత యై యభీష్టకే
ళీపరిణామ మందియును లేమ పునఃపరిభోగసౌఖ్యముం
జూపుల వేఁడుచున్ మధురచుంబన మెన్నఁడు చేయు నొక్కొఁ జం
ఘాపరభాగచుంబిశిఖరాయతలంబితకేశపాశ యై. 57

వ. అనుచు మనోరథంబులం దేలుచు ననేకమదనవికారంబులకు నెల వగుచుండ
నచ్చోటు వాసికొని పోవం దలంచి చారాయణుం డిట్లనియె. 58

క. మర్మస్పర్శనఁ బరఁగుము, హర్మ్యహురాగతవినోదయోగ్యముల మెయిం
బేర్మిఁ జరింతురు క్రీడా, నిర్మాల్యము లేల మేదినీకాంతులకున్. 59

వ. వనవిహారం బొక్కటియ యేల ద్యూతక్రీడ యొనర్తు గాని నిజనివాసంబునకు
విజయంచేయుఁ డని తోడ్కొని చని యచ్చట రసాంతరంబు పుట్ట విన్నో

దంబులును నీతిగర్భితంబులు నగుకథావిశేషంబులు వినిపింపఁ దలంచి యి
ట్లనియె. 60

గీ. దేవి మేఖల నెప్పుడు నీవిధమునఁ, జాల మన్నింప నీసు మత్సరము పుట్టి
నయవిధిజ్ఞ కళావతి నన్నుఁ బంచి, భంగపెట్టించె దాని భూపాల! కంటె. 61

క. మతిమంతులు నిజశత్రుల, నితరులఁ గొని యేనిఁ జెఱతు రెన్నివిధములన్
సుతహంత యగుకిరాతుని, మృతుఁడుగ శుకి చేసినట్లు మేధాబుద్ధిన్. 62

వ. అనుటయు నది యె ట్లనుడు నమ్మహీనాయకునకుం జారాయణుం డి ట్లనియె.

చ. ఒక పెనుగానలో నొకమహోన్నతభూజమునందు బాలశా
బకము లప్రస్ఫుటప్రబలపక్షములం గలవానిఁ బ్రోచికొం
చొకశుకి యుండు న త్తరువునొద్దన చిక్కని వెల్లమ్రానియం
దొక ఫణినాయకుండు గరళోల్బణుఁ డుం డొకకోటరంబునన్. 64

వ. అ ట్లారెండును నుండ నంత నొక్క నాఁడు. 65

క. తొల్లియు నచ్చోటన తన, పిల్లలఁ గొని చన్న బోయ పెద్దయుఁ గ్రూరుం
డుల్ల మలర నభ్భూరుహ, మ్మల్లన నెక్కి తనకూచ్చునాత్మజయుగమున్. 66

క. చంచులు పెఱచుచు నఱవఁగ
నించుక కృప లేక పట్టు టేర్పడఁ గని శో
కించుచు గోదించుచుఁ బల
వించుచు నాతనికిఁ జిలుకవెలఁది యిటు లనెన్. 67

క. అన్నన్న! లేవె పక్షులు, కన్నులు తెఱవనివి తిన్నఁ గలదే చవి నా
మన్నిఁ గొన నేల విడువఁ గ, దన్న యకట చంపఁ గూడు నయ్య శిశువులన్.

చ. అనవుడు బోయ యి ట్లను శుకాంగనతో నడలంగ నేల నీ
తనయులఁ జంప నేను బిశితంబులు బ్రాఁతియె నాకు వీనిఁ గై
కొని వెల వెట్టువారికడకుం జని యమ్ముదు విల్చి వారునున్
బెనుతురు గాని వీని కొకపీడ యొనర్పరు నమ్మ నెమ్మదిన్. 69

క. అనవుడు దానికిఁ గీరాం, గన సంపఁగ నొల్ల వేనిఁ గనకము పైఁ గాం
క్షన పట్టి తేని విడు నా, తనయుల నీ కేను జూపెదను హేమంబున్. 70

మ. ప్రకటశ్రీయుతుఁ డొక్కఁ డీయడవిలోఁ బాటచ్చరశ్రేణిబా
ధకు నుల్లంబున నోడి మున్న తనయర్థం బొక్కచోఁ డాఁచెఁ ద
ప్పక యేఁ జూచితి నున్న దాపనిఁడిఁ జూపం జాలుదు న్నన్నుఁ బు
త్రకులం గాచెద వెల్లనాఁడు నని వంతం బాపి రక్షింపుమా. 71

మ. అనినం జెన్నిధి యప్పుడే కనినయ ట్లానందముం బొంది యే
నిను నమ్మింపుదు నంచు శాబకముల న్నీడంబులోఁ బెట్టి చ
య్యన భూమీజము డిగ్గి బోయ నియతుం డై యొక్కచో నిల్చి యు
ర్లను బోనున్ వెస మట్టి నమ్మఁదగుపల్కుల్ పల్కె నిర్వంచనన్. 72

వ. అప్పుడు కీరవనిత వానితో ని ట్లనియె. 73

క. నమ్మిక లవి యేమిటికిం, గ్రమ్మఱ వచ్చెదవె నీవు ఖగమృగబహుదుః
ఖమ్ములకును నాచూపెదు, సొమ్ములపైఁ జేయి వెట్టి సుఖి వైనతుదిన్. 74

వ. అని పలికి యిద్దర మ్మని తోడ్కొని చని. 75

గీ. పూనుకాడి యంతభుజగంబు లో నున్న
వెలఁగ ప్రాని వెడఁదతొఱ్ఱ జూపి
దీనఁ జేయి వెట్ట లోన నున్నది సవి
శేషహేమ మనుచుఁ జిలుక చెప్పె. 76

ఉ. చెప్పిన వెఱ్ఱిబోయ వలచే యటు సొన్పడు నందుఁ గన్నులన్
నిప్పులు రాలుచున్న మహనీయతరోజ్జ్వలభీషణోరగం
బుప్పలవాయిఁ దిన్న విష ముగ్రత నెక్కుడు దృష్టి చీఁకటుల్
గప్పఁగ నోరఁ బెన్నురువు గ్రమ్మ మృతుం డయి కూలె మేదినిన్. 77

గీ. ఆస పాపజాతి యఖిలంబుపైఁ బాఱుఁ, బసిఁడిమీఁద నేల పాఱకుండు
పసిఁడిమీఁద నాస పాఱినమనుజుండు, తనకు వచ్చుకీడు తలఁపఁ గలఁడె? 78

క. తనచే నసాధ్యుఁ డగుశ, త్రుని నన్యునిచేత నైనఁ ద్రుంగునటులుగా
నొనరింప వలయుఁ దా నెఱుఁ, గనివాఁడునుబోలె నీతికౌశల మెసఁగన్. 79

వ. అని చెప్పి చారాయణుండు మఱియు ని ట్లనియె. 80

క. పగవాఁడ నైననాయెడ, మొగ మోడి మదీయవాక్యములు నమ్మి నిజం
బుగ నరయ దయ్యెఁ గార్యము, మిగులఁగ దుర్బుద్ధి గాదె మేఖల యధిపా!

క. మొగ మోడవలయు నైనను
మొగమోటకుఁ గొలఁది కలదు మొగమోట ఘనం
బుగ నొప్ప దాలి కెక్కుడు
మొగ మోడినయక్షుఁ డొకఁడు మును హతుఁ డయ్యెన్. 82

వ. అక్కథ యె ట్లనిన. 83

క. యక్షపురంబునఁ గలఁ డొక, యక్షుఁడు ప్రియభాషణుఁ డన నతనివనిత ప
ద్మాక్షి నిపుణిక యనం గల, దక్షుద్రస్నేహముఁ దాతఁ డయ్యతివయెడన్. 84

ఎంత బాగా ఉంది. పగవాడనైన నన్ను ఈ మేఖల ఎలా నమ్మింది లోపల?
అంటూ మొగమాటానికి పోతే ఏంతే మరి అంటూ చారాయణుడు మోసపు
[illegible] కథని రాసి చెప్పాడు.

క. ఆరమణి గర్భభరశ్ర్యం, గారంబున నొప్పెఁ బౌరగణ మట్టియెడన్
క్షీరాబ్ధినాథునుత్సవ, మారూఢం బగుటఁ జూడ నని యేఁగుటయున్. 85

వ. ప్రియభాషణుండు నిపుణికతోడ. 86

ఉ. కొండికదాన వెన్నఁడును గ్రొత్తవినోదముఁ జూడ వింటఁ గా
వుండెద నేను నీవు సను ముత్సవ మిమ్ములఁ జూడ నన్న నీ
వుండఁగ నొంటి నేఁ జనుట యుక్తమె కా దని పల్కి తేని నీ
నిండినచూలు మోచుకొని నేర్తునె యచ్చటి కేను బోవఁగన్. 87

క. అనుటయు నీ వటఁ జను మిటఁ, జనుదెంచినయంత దాఁకఁ జామా! సీతా
ల్చినగర్భముఁ దాల్చెద నని, తనకుక్షిం జూలు మోచి తరుణిం బంచెన్. 88

చ. పనిచినఁ బోయి చూడ్కులకుఁ బండు వనం దగునుత్సవంబు నిం
పెనయఁగఁ జూచి వారుఁ దమయిక్కలకుం జనఁగా రసాంతరం
బున మన మూఁది యింటిదెస వోవుట మాని విభుండు మున్నుఁ జే
సినయుపకారముఁ మఱచి చేడియ చింత యొనర్చె నాత్మలోన్. 89

ఉ. ఇంటికి నేను బోఁ దడవె యెప్పటిగర్భము నిచ్చువాఁడు నా
కంటికి నిద్ర లేక యది గైకొని మోవఁగ నేల వానిచేఁ
గొంటినొ తింటినో యతనికుత్సితబీజము వానిమీఁద నే
త్రుంటితి నింత నా కొరులమూఱుఁ బొగడ్తయుఁ జూడ నేటికిన్. 90

ఉ. చూలు వహించి వెక్కుచును స్రుక్కుచు నుండి ప్రసూతివేదనం
జాలఁ గలంగి యాపదను జడ్డపడంగను నాకు నేల నా
పాలిటిదయ్య మద్దొసఁగు వాపినఁ గ్రమ్మఱ నేల పోదు నం
చాలలితాంగి వేఱ నొక యత్నునిఁ గూడి నిజేచ్ఛ నేఁగినన్. 91

వ. అంతట. 92

క. కడు పధికముగాఁ బెరిఁగిన, వెడమాయం బేని నూర్పు వెడలక కడు లోఁ
బడి యాలికి విఃపించుచు, వెడఁ గగుయత్నుండు ప్రాణవిరహితుఁ డయ్యెన్.

క. తగ దొరుల నమ్మ నెప్పుడు, దగువారల నమ్మి రేనిఁ దగుఁ గాక మహిం
బగవారల నమ్మఁ దగదు, పగవారలకంటె వలదు భామల నమ్మన్. 94

క. బలుపున మెలపునఁ గేళిన, కులభామిని వెఱచుఁ గూర్చుఁ గుమతిత్వమునన్
దల నెక్కించుకొనం బతి, కులమును బ్రాణంబు సొమ్ముఁ గోమలి చెఱచున్.

క. దాక్షిణ్యగుణం బుత్తమ, లక్షణ మని సజ్జనులు దలంతురు తమకుం
దాక్షిణ్యము సేసిన నధి, కక్షుద్రులు మోసపోక గాఁ జూతు రిలన్. 96

క. నమ్మక పోరాదనుతఱి, నమ్మి రిపునిఁ గలసి నమ్మ నడచుట యొప్పున్
బిమ్మట నేమఱక తొలఁగి, నమ్మక యుండంగ వలయు నరవర! వానిన్. 97

వ. ఈయర్థంబు దెలుపునహిమూషోపాఖ్యానంబు నెఱింగింతు నవధరింపు మని
చారాయణుం డిట్లనియె. 98

క. క్రూరోరగగ్రహణవిష, హారి యనం బరఁగునొక్కఁ డతిశయవిషదు
ర్వారము నొకసర్పంబు న, భీషుం డై పట్టి వెదురుఁబెట్టియఁ బెట్టెన్. 99

క. పట్టి దానికి నెర గాఁగఁ బట్టి యొక్క, మూషకము వైచి పెట్టియ మున్నవోలె
గట్టి డించిన నురగంబు గఱవ రాఁగ, నెలుక బెదరక వానితో నిట్టు లనియె.

క. నీ కుపకారము సేసెద, నా కభయం బిచ్చి కావు నాకార్యంబున్
నీకార్యంబులు మే లై, చేకుఱు నాతోడఁ జెలిమి చేసితి వేనిన్. 101

క. వాఁడు వట్టినపుడ వానిచే నైనను
జావవలయుఁ దనకుఁ జావు నిజము
చచ్చియున్న నన్నుఁ జంపి చావనినీకుఁ
జెఱన యుండఁ దలఁచు టెఱుక యగునె? 102

క. ఏ నధికబలుఁడ నాచేఁ, గానిది యీయెలుకచేతఁ గా నోపెడు నే?
తా నాచెఱ యేవిధమున, మానుచు నిది కల్ల యనుచు మదిఁ దలఁపకుమీ. 103

క. విను మెవ్వాఁ డేకార్యం, బున నిపుణుఁడు దానియందుఁ బూజ్యుఁడు హీనుం
డన వలదు సూది నయ్యెడు, పని చిక్కనికఱతచేత బా గై యున్నే? 104

ఉ. చాల నభీష్టముల్ తనవశంబుగఁ జేయునయోగ్యుఁ డైన న
మ్మేలుఁ దలంచి దానియెడ మిక్కిలి వేడుక సేఁత నేర్పగుం
గాలపువేఁటకాఁడు ఝషకాంక్షన తా నుదకంబుమీఁదటన్
దేలెడుదృష్టిపై నిలుపు దృష్టియుఁ జిత్తము నాదరంబునన్. 105

క. తనకార్యముకొఱకై హీ, ననియొద్దకు నైనఁ బోఁ జను మహిం జండా
లునియింటి కుపశ్రుతికై, చను ననఁగా స్వార్థ మూఁది సద్విజుఁ డైనన్. 106

క. నాచెప్పినట్లు చేసిన, నీచెఱ విడు నట్లు గాక నిలుపోపక నీ
వే చంపి నన్ను నోరను, వైచికొనిన మాను నే భవత్తు త్తెల్లన్. 107

మ. చెఱ యేఁ బాపిన నిష్టమైనవలనం జె న్నొందఁ గ్రీడించుచున్
జిఱుగప్పల్చవిమీలు బల్లు లెలుకల్ చిట్టెల్క లాహారముల్
వఱలన్ గుత్తుకబంటి తెమ్మెరలఁ గ్రోలం బెట్టపెంబాముతో
నెఱియున్ భోగముసుట్టునుం గలుగు నీవీక్షింపుమా నెమ్మదిన్. 108

క. అనవుడు నురగము సంతస, మున నాఖువుతోడ స్వప్నమున నైనను గీ
డొనరింప నీవు నాచెలి, వనుమానముఁ దక్కి నమ్ము మానందముతోన్. 109

వ. ఇక్కరండనిగ్రహ మె ట్లుడిపెద వుడుపు మనుటయు. 110

క. ఏ నొకమంత్రము నీతల, పైనుండి జపించి జపము వారించి తగం
గా నినుఁ బిలిచెద కదలక, నీనయనయుగంబు మూసి నిలు మందాఁకన్. 11

చ. అని నియమించి దానిశిర మంజక యెక్కి కరండనిగ్రహం
బనువుగఁ జేసి యాఖునక మప్పుడ పోయె ననంతరంబు లో
చనములు విచ్చి చూచి మది సంతసము౯ వగపుం దలిర్ప నా
కనుమనఁ దాను నేఁగి భుజగం బొకబొక్క వసించి యాత్మలోన్. 112

క. ఎలుక కపటమున నా క, న్నులు ద్రావెను ద్రింగ లేద నో రెరియఁ గటా
తొలఁగద నికేటిబ్రతు కని, తలఁచె దురాత్మకుల కెందుఁ దగవులు గలవే?

క. కెలనికి మేలుగఁ దనకుం, గలిగెడునింద్రత్వ మైనఁ గా దనుఁ దుదిఁ దాఁ
బొలిసిన మే లని తలఁచును, ఖలుఁ డొకనికిఁ గీడు సేయఁ గలిగినఁ జాలున్.

వ. ఇట్లుండి దానిబిలద్వారం బెఱింగి యయ్యాశీవిషం బమ్మూషకంబునకు దోషం
బాపాదించునభిలాషంబున. 115

గీ. దానిబొక్కకడకుఁ దా నేఁగి నాప్రాణ, సఖుఁడ! యేగుదెమ్ము సత్వరముగ
నొక్కచోటనుండి యుచితసల్లాపముల్, సేయవలె నటంచుఁ జీరుటయును.

క. లాఁగలు పెక్కులు లోపల, బా గై తను ముట్టినపుడ పట్టువడక లో
డాఁగి చని వెలికి వెలువడి, పోఁ గనుములు గలుగునట్టిబొక్కయెదిరికిన్.

వ. వచ్చి మృద్బద్ధం బైనబిలద్వారంబున నిల్చి యా ద్విజిహ్వంబుతో ని ట్లనియె.

క. నన్ను మును పీవు గాచితి, నిన్నుం జెఱ నేను వాపి నిలిపితి నాకై
మున్ను గలకరుణ మఱవక, మన్నింపుము నాకు నంత మానము చాలున్.

గీ. వియ్య మందఁ బోక కయ్య మొనర్చుట, చెలిమిసేఁత తమకుఁ దలము గాని
వారితోడఁ దగదు వలదు నీచెలిమికి, నేను హీనబలుఁడ నెంతవాఁడ. 120

క. ము న్నీవు నాకు వైరివి, మిన్నక కార్యార్థమాత్రమిత్రత్వమున
న్నన్ను సహింపుదువే చను, మిన్నిపలుకు లేల వెఱతు నే నినుఁ జేరన్. 121

వ. అనుటయు నయ్యహి సిగ్గువడి పోయె నమ్మూషకంబును సుఖంబున నుండె
నని చారాయణుం డెఱింగించెఁ దనవలన మహీనాథవృత్తాంతంబు సమస్తంబు
విని భాగురాయణుండు కఱపి పుత్తేరఁ గలావతి యొక్కనాఁడు రత్నసుందరి

పసుపు నెపంబునఁ గేయూరబాహుభూధవుండు చారాయణసహితుం డై యుండు నెడ కేతెంచి మ్రొక్కిన దేవీప్రేరిత యై యది తన భావవృత్తి యరయ వచ్చినదిగాఁ దలంచి ప్రసంగవాక్యంబుల నింగితంబు నొడిచికొని ధరణీశుండు దానిం గారవించి యాసీనం గా నియమించిన నది యట్ల చేసి వారి నుద్దేశించి సస్మితానన యై యి ట్లనియె. 122

క. మీ యాడెడు నేకతమున, నాయకనము నృపతియఱుత హారం బది నా
చేయార గ్రుచ్చినది మీ, రేయెడ మొఱఁగెదరు నన్ను నీనేరుపులన్. 123

వ. అనుటయు ధాత్రీనాథుం డాశ్చర్యసందేహసంతోషంబులు మనంబున ముప్పిరిగొనుచుండ ని ట్లనియె. 124

క. చారాయణుఁడును నీవును, నారయ సరి నాకు నిట్ల యాడెదు నీ కే
వారింతు నె యేకత మీ, హారం బెవ్వరిది మొదల నంగన! చెపుమీ. 125

వ. అనుటయు నెఱింగించెద నవధరింపు మని యి ట్లనియె. 126

క. భూవర! యొప్పును లాట, క్ష్మావల్లభపుత్రి నిఖిలజనలోచనసౌ
ఖ్యావహలావణ్య మృగాం, కావళి యనుకన్య హృదయహారిణి యగుచున్.

వ. అనుపలుకు విని కేయూరబాహుమహీపాలుండు కళావతితో లాటేశ్వరుం డగు చండవర్మకు మృగాంకవర్మ యను పుత్రుం డొక్కరుఁడు కాక పుత్రి యొక్కడిది యనిన నది నగుచు నలుదిక్కులుం బరికించి యిది యొక్క యత్యంతరహస్యంబు దాని నియమం బవధరింపు మని యి ట్లనియె. 128

క. ధాత్రీశ! లాటపతి యొక, పుత్రిం గని పుత్రనామమున వెలయించెన్
శత్రుకులసమీకరహ, స్యత్రాణప్రౌఢకౌశలాలసుఁ డగుచున్. 129

చ. అతఁడు సుబుద్ధి గాన దనయన్వయపూర్వులు దొల్లి యేకసం
తతు లయి పోక తా విధికృతం బగుటన్ దనయందుఁ బుత్రహీ
నత పరదేశరాజులమనంబునఁ బుట్టక యుండ నోపి ర
క్షితముగఁ జేసె మంత్రముఁ బ్రసిద్ధిగ మ్రోసె సుతత్వ మెల్లెడన్. 130

వ. అయ్యపత్యంబునామంబు మృగాంకావళి యై యుండ మృగాంకవర్మ యని పుంస్త్వంబు దోఁపఁ దదభిధానంబునం బిలుచుచుండు రక్కన్నియఁ బొందిన వానికి సార్వభౌమత్వంబు కలుగు నని మహాపురుషాదేశంబు. ఈ రహస్యంబు సమస్తంబు బుద్ధిమదగ్రేసరుం డగునీమంత్రి భాగురాయణుండు భవదీయ రాజ్యలక్ష్మీప్రవృద్ధిచింతానిరతాత్ముం డగుట నక్కుమారీరత్నంబును వరించి దేవర సార్వభౌమత్వంబుఁ బొందవలయు నని యొక్కయుపాయంబున నా

రాజపుత్త్రి నిప్పురంబునకు రప్పించి తన మందిరంబున నిడికొని రత్నసుందరి యందు భయభక్తిసమేతుం డగుట నద్దేవివలని దాక్షిణ్యవిశేషంబున నీ కెఱిఁగింప నేరక యున్నవాఁడు భవద్వల్లభ యెఱుంగకుండ నమ్మహామంత్రినియోగంబున నప్పురంధ్రీభూషణంబునకు నెచ్చెలి వై వర్తిల్లుదు. 131

ఉ. ఆమదిరాక్షి రూపవిభవాతిశయంబులు దృష్టి సోఁకినన్
సోముని నైన వేఱ యొకసోముఁడు నామని నైన వేఱ యొ
క్కామని కమ్మదెమ్మెరల నైనను వే ఱొకకమ్మతెమ్మెరల్
కాముని నైన వేఱ యొకకాముఁడు నేచుదు రేమి సెప్పుదున్. 132

మ. వనితారత్నము నాసికాపదభుజద్వంద్వశ్రవోలంకృతుల్
వనజామోదపుటూర్పు లంచనడుపుల్ వాణిద్యుతుల్ శాతలో
చనపార్శ్వంబులు దృష్టిదోషమున రక్షల్ నాకుఁ జూడంగఁ ద
ద్ఘనముక్తావళి యందియల్ వలయముల్ కళ్యాణతాటంకముల్. 133

మ. కరపాదాంబురుహాంబులుం గుచరథాంగద్వంద్వమున్ మోముచం
దురుతో దాయలు ఘ్రాణచంపకము శత్రుల్ కుంతలాళింద్రసం
కర మిట్లక్కట! యీవధూసురుచిరాంగశ్రేణి కన్యోన్యం బర
స్పరవైరం బని కుంది డస్సె ననఁగా సన్నంబు కౌ నింతికిన్. 134

క. నయనాద్యవయవములు మే, లయినపదార్థములఁ జేసె నజుఁ డవి వోఁగా
బయ లావటించి చేసిన, క్రియ నయ్యరవిందగంధికి న్నడు మొప్పున్. 135

క. తొడవులకుఁ దొడవు తనులత
తొడవులకుం దనులతకును దొడవులు నడుపుల్
తొడవులకును దనులతకును
నడుపులకుం దొడవు లరయ నాతుక నుడువుల్. 136

సీ. వాలుఁగన్నులుఁ జారువదనంబు నుత్పలవనజకాంతుల నుద్దివైచికొనఁగ
మెఱుఁగుదంతములు వాతెఱయును మౌక్తికచూతపల్లవముల నూడువట్ట
భుజములు మృదుహస్తములును లేఁదూండ్లను జెందొవరేకుల సిగ్గుపఱుపఁ
జనుఁదోయి నలకలు జక్కవకవ పొందుఁ దుమ్మెదచాయల దొద్దగొనఁగ

గీ. నలిక మరచందురునితోడఁ జెలిమి సేయఁ
దియ్యపలుకులు దేనెలు వియ్య మంద
నడపు లంచలఁ గొంచదనంబు సేయఁ
గమలగంధిమనోహరాకార మలరె. 137

క. ఆచేడియసౌందర్యము, నాచేఁ జెప్పించుకొని వినఁగ వలసి మదిం
జూచెదవు గాక ముందఱ, నీచూడనియదియె మేదినీవర! చెపుమా. 138

వ. అది యె ట్లంటేని. 139

చ. ఆసదృశతారమౌక్తికసమంచితనాయకరత్నమై సమం
జనరుచిపుంజమై తన కుచంబులమీఁద వెలుంగుహారమున్
బిసరుహహస్త పుచ్చుకొని పెట్టెఁ బ్రియంబునఁ జేరి 'తే నమః
ప్రసవశరాసనాయ' యని పల్కుచు భూపతికంధరంబునన్. 140

క. అనుపలుకు లమృతముక్రియం
దనవీనులు సొచ్చి డిగి హృదయ మంతయు నిం
డిన నొకవడిఁ ద న్నెఱుఁగక
జనపతి పూర్ణానురాగశరనిధిఁ దేలెన్. 141

వ. చారాయణుండునుఁ బ్రమోదితహృదయుఁ డగుచుం గళావతిశిరం బక్కున నదిమి పెక్కుదెఱంగులం బ్రశంసించె నప్పుడు మేదినీనాథుండు. 142

గీ. బహువిధంబులఁ గొనియాడి బహుళరత్న
భూషణాంబరాదికము లపూర్వముగను
నొసఁగి యర లేనిచెలిమిఁ దీ పెసఁగఁ దన్నుఁ
గలిపికొనియెఁ గళావతి గారవించి. 143

వ. లాటరాజనందన యటమీఁది వృత్తాంతంబు వినుకౌతూహలంబుతో నునికి యెఱింగి కళావతి యి ట్లనె నట్లు దేవరచే గృహీత యయ్యును నటమున్న నాచే బోధిత యగుటం గులపాలికాధనంబైన ధైర్యం బవలంబించి యెట్టకేనియు విడిపించుకొని తదీయశయనగృహంబు సుషిరస్తంభకుడ్యరచితంబు గావున యంత్రస్తంభాంతరిత యైనయంభోరుహవదనను వీడ్కొని తత్సదనంబున నుచితప్రభాతం బగుచుండ నేనును మదాలయంబున కరిఁగి యొక ప్రహరమాత్రంబు మసలి మరలి తన యున్నతావునకుం బోవ నమ్మానవతియు నంతక మున్న బహువిధమన్మథవికారమగ్నమానస యగుచుండి తన యంతర్గతంబున సకలంబు నాకు వెలిఁబుచ్చ సిగ్గుపడి పద్యత్రయంబు గా రచించి యొక్క కేతకీపత్రంబున లిఖించి యేమఱి పడవైచినట్లు పడవైచి నను గనుంగొని మిథ్యానిద్ర నభినయించుచు నావలిమొగంబైన నేనును గదియం జని యక్కేతకీపత్రగతం బగుపద్యత్రయంబు పఠించితి నది యె ట్లనిన. 144

ఉ. తా డిడి పండుఁ దిన్నక్రియఁ దద్దయుఁ గాలము గోరుచుండఁ గాఁ
జూడఁగ వచ్చునే నృపతిసుందరు నింకొకమాటు గ్రమ్మఱన్
జూడఁగ నైన నోఁచు నొకొ చూడ్కి కళావతి దేవి కాత్మలో
నోడి ప్రమాదకార్య మిది యొప్పదు వో మ్మను నొక్కొ దైవమా! 145

చ. ఇట నటఁ జూడ రా దతని నింత యొకప్పుడు నాఁడు నిండ ముం
దటఁ బాలయంగ నీ కిది ప్రధానుఁడు వల్కఁగఁ జామ! యిద్ది నీ
చిటిపొటిపొన్నచుక్కలకుఁ జేతులు సాఁచుట గాదె యిట్టి దు
ర్ఘటనపుఁగూర్మికిన్ శరణు గల్గనె యెట్లు దలంచి చూచినన్. 146

ఉ. ఒంటియ యుండి జేయు విభుఁ డుల్లమునం బ్రియ మార నన్ను నీ
బంటుగ నేలికొ మ్మనుచుఁ బట్టినయప్పు డ దేల యియ్యకో
కుంటి వృథాభిమానమున నుంటఁ గళావతి మాట లేమి గా
వింటిఁ బ్రసూనసాయకుని వింటిదృఢత్వముఁ గంటి వేల నై. 147

వ. అని చదివితి నని చెప్పిన సానందహృదయుండును సదయుండును లజ్జావద
నుండును నగునజ్జగతీవల్లభు నవలోకించుచు నటమీఁద నవధరింపు మని కళావతి
యి ట్లనియె నే నప్పద్యంబులు పఠించి యదరిపడి యక్కాంతవలవంతకుం
దల్లడిల్లుచుండ నప్పుడ నిద్ర తెలిసినదియ పోలె నచ్చతుర నన్ను గారవిం
చుచుఁ బర్యంకతలంబు డిగ్గి భాగురాయణుని నిష్కుటకూటంబులోనికిం బోవు
తలంపునం బిల్చిన నేనును న ట్లైనం బ్రొద్దు గడపుట కార్యం బని యనుమ
తించి యరుగ నందుం బ్రవేశించి. 148

సీ. ఎలఁదేఁటికదుపుల యెఱకలఁ బడ నెక్కి పయిఁ గ్రమ్ము పూవుదేనియల సొబగు
వలసినచోన కోకిలదంపతులకుఁ దల్పము లగుచిగురుజొంపముల పెంపు
బలుకురాచిలుకల పక్షానిలంబుల నలుదెస రాలెడుఫలచయంబుఁ
బుప్పొడితావితోఁ బొదరిండుల బయళ్ళఁ బూరించుతిన్నని మారుతంబు

గీ. నంగజానల మంతంత కగ్గలముగఁ, జేయఁ దలపోఁతలకుఁ జొచ్చి చిత్త మలయ
నిష్టసంచారకేళికి నెలయ లేక, యబల యొక్క లతానిలయంబు సొచ్చె. 149

ఉ. హారము వెట్టుచోట భవదంగము సోఁకినయంగుళాగ్రముల్
భూరితపఃప్రభావఘనపుణ్యఫలంబులు గాఁ దలంచి యం
భోరుహనేత్ర రిత్తమెయిఁ బొల్పఱుచుం బలుమాఱుఁ జూచు స
స్మేరముఖారవిందమునఁ జేర్చుకొనుం బులకాంకితాంగి యై. 150

చ. విరహజవేదనాభరము వెమ్మఁగ డెందముమీఁదఁ గన్నునీ
రురువుగ నుండె ముద్దియ మహోగ్రమనోభవవహ్ని యంగముల్
దరికొని కాల్ప నందు సకలంబును నార్పఁగ లావు లేమి జీ
వరమణుఁ డర్థి నుండెడునివాసము సేరియు నార్చుకై వడిన్. 151

వ. మఱియును. 152

శా. వాడెన్ మోము రసాలబాలలతికావాసంతికల్ సూడఁగా
నోడెం గన్నులు వెచ్చగాఁ దొడఁగె నిట్టూర్పు ల్తనూవల్లికం
గూడెం దాపము వీలుకోలు వడసెం గోష్ఠీవిహారంబు నూ
టాడెం దాలిమి మేను డస్సెఁ గడు నయ్యంభోజపత్రాక్షికిన్. 153

వ. అట్లుండ నెట్టకేలకు దివంబు గడచి రాత్రి కొంత సనుటయు. 154

ఉ. చుక్కలరాణివాసములు చుట్టును గొల్వఁ గొలంకు లెల్లఁ జే
రెక్కనజోదు పూవిలుతునిష్టుఁడు వెన్నెలపుల్గు లాశ్రితుల్
జక్కవదోయి తామరలు శత్రులు గా విహరించురాజు మి
న్నెక్కె మనోజతాపభర మెక్కె వియోగుల కెల్ల నత్తఱిన్. 155

సీ. అంజనగిరి తనయద్రిఁ బోలుడు నీలకంఠుండు తోరణకట్టఁ బనుప
ననిమిషనది వెల్లి యని యగస్త్యాదులు బయల నెచ్చట నైనఁ బాఱె క్రుంక
వనజజగుహులు వాహనములు దడఁబడ్డ నలిగి వా దడచి సత్యముల కరుగ
విచికిలప్రసవంబు వెదకెడుతేఁటి తమాలపువిరులందు మసలుచుండఁ

గీ. బ్రీతి బిసనాళములు గొని పీల్చఁ గలిగి
తగినదోయిళ్ళలో నుంచి త్రావఁ జాలి
ముట్టి కుండలు నిండంగ ముంచఁ గలిగి
నిఖిలదిక్కులఁ బండువెన్నెలలు వెలిఁగె. 156

వ. అట్టియెడ మూర్ఛిత యైనలాటరాజపుత్రిని సేదఁ దీర్చి నాచేయువివిధోప
చారంబుల మదనానలం బగ్గలించితి. 157

క. సుందరి కిడ్డకుచాంతర, చందన మొప్పారెఁ దాపసంతాపిత మై
కందర్పవహ్ని నెరిసిన, డెందంబున నీరుకై వడికిఁ బట్టగుచున్. 158

వ. అప్పు డేను దల్లడిల్లుచు నొక్క చెంగలువదండ పయి కెత్తి. 159

సీ. పద్మాస్య యనియెడిపగ మాని చంద్ర! యుత్పలనేత్ర యని కృప పట్టుకొలిపి.
కచభరంబున నీలకంఠాభ యని చూడ కంగజ! రతిబోటి యని యొఱంగి

రామాభిధాన యీకోమలి యనక పికాధిప! కలకంఠ యగుట నూచి
చంపకనాస యచ్చలము మాని యళీంద్ర! కల్హారనిభగంధి గాఁగఁ దెలిసి

గీ. రమణ వెన్నెలచిచ్చువేఁడిమికిఁ బాపి
ప్రసవసాయకములఁ బాలుపడఁగ నీక
వాఁడివిషమున సల్పక వాఁడిఝుంకృ
తుల నదల్పక దయఁ గావఁ దలఁపుఁ డయ్య. 160

వ. అని యిట్లు మొఱ యిడుచున్న నన్నుం గనుంగొని దైన్యగర్భహాసంబు దెచ్చు
కొని యా రాచూలి యి ట్లనియె. 161

చ. సరసిజనేత్ర! యేటి కిటు చందురు గిందురుఁ గాముఁ గీము నా
తురపడి వేఁడె దింతటనె దోషమనస్కులు వారు చాల నీ
పరిభవ మోర్వ రీ యలరుఁబాన్పుల వెన్నెల యింత దెచ్చె నే
దరికొనఁజేయు మంతఁ బరితాపము గీపముఁ జక్క నయ్యెడున్. 162

వ. అనిన నవ్వనం బట్టిది గావున నాస్థలంబు వాపి నివాసహర్మ్యంబునకుం గొని
పోవం దలంచి యా సుందరి కి ట్లంటి. 163

చ. అలరులసెజ్జ యింతయును నంగజు దింతియ(?) యంపప్రోవు కో
మలదళవీజనంబు లవి మందమరుజ్జనకంబు లీ లతా
నిలయము కాముతా వకట నిల్తురె యిచ్చట డాఁగఁ బోయియుం
దలవరియింట డాఁగి రనుతద్వచనం బది నిక్కవంబుగన్. 164

వ. అని నివాసహర్మ్యంబునకుం దోడ్కొని యరిఁగితి నాత్రియామయు సహస్ర
యామ యై కడచె నిది యజ్జోటివిధం బిటమీఁద నీవ యెఱుంగు దని పలికినం
గళావతికి మఱియునుం బసదనం బొసంగి వీడుకొలిపి చారాయణుం జూచుచు
న న్నరపాలుండు. 165

మ. కలయో నిక్కమొ మున్నెఱుంగఁ దుది నిక్కం బైన నే తన్వియో
తెలియం జాల సమస్తకార్యగతులుం దెల్లంబు లై చేకుఱెఁ
గులశీలాదులఁ దుల్య యిట్టి సతి నాకుం జేర్చె దైవంబు నా
లలనారత్నముఁ బెండ్లి యాడ నవలీలం గల్గు టెబ్బంగియో? 166

వ. అనుచుండ భాగురాయణుం డొక్కచతురోపాయంబు గఱపి పుచ్చ నొక్క
నాఁటి రేపు కళావతి రత్నసుందరిం గొలువం జని మేఖలాద్వితీయ యై
యుండ నద్దేవితో ని ట్లనియె. 167

క. మనరాజు విదూషకుఁ గొని, మనమేఖల మోసపుచ్చె మన మిపు డా బా
పని మాఱుసేఁత యిది యొక, పనియే జేల్వెట్ట వలదె పార్థివతిలకున్. 168

వ. అనుచుంటయు నద్దేవి సంతసిలుచు నట్లైన మెచ్చు గల దది యే యుపా
యంబు సెప్పు మనవుడుఁ గళావతి యి ట్లనియె. 169

సీ. మనరాజు భోగైకమగ్నుండు కావున నేమిఁ జెప్పిన నమ్ము నెఱుఁగ లేఁడు
చండవర్మని కొక్క చక్కనిపుత్రి మృగాంకవర్మని చెలియలు శుభాంగి
కల దా కుమారిక కరము పట్టినవాఁడు సార్వభౌమత్వవిస్తారమహిమ
మందుట తొల్లి సిద్ధోపదేశం బని మున్న యార్యులచేత విన్నదాన

గీ. నొరుఁడు సార్వభౌముం డన నొప్పుచుండ
నీవు హీనుఁడ వై యునికి నేను సాల
దాని నీవ పెండిలి గమ్ము ధరణినాథ!
సార్వభౌమత్వ మది నీక జరుగ వలయు. 170

వ. అట్లైన నేను సార్వభౌముని యగ్రమహిషి యన నఖిలనరేంద్రవల్లభాభిసేవ్య
నై యుండుదుఁ గులపాలికలకు నే యుపాయంబునం గాని నాథు నభ్యు
దయంబు గోరు టుచితంబు గా కస్మదీయమానమధురంబును బరిణయవిస
రంబు నగుకామభోగంబువలని ప్రియం బెట్టిది య ట్లుండుఁ గాక యారాచ
కన్నియ మా పినతల్లికూఁతు రగుటను నిది నా కావించుపరిణయం బగుటను
మానసంబున నీసు పుట్ట దివ్విధంబుఁ జేయుట నాయభిమతంబులు సకలంబులుం
జేయుట యిక్కార్యం బంగీకరింప కునికియ నాచనవు లెల్ల నంగీకరింప కునికి
యని నరనాథునకుం జెప్పి పుచ్చి యొడంబడఁ జేయునది యటమీఁద మృగాంక
వర్మ యజాతశ్మశ్రూదయుం డగుట నతని కేను వనితాశృంగారంబు లలవ
రించి తదీయానుజ యని ప్రమోయించెద నిక్కపువివాహంబునకు వోలె వివాహ
ద్రవ్యంబులు సమస్తంబులు సమకట్టుం డివ్విధంబున మాయలు వన్ని యవ్వే
డుకకాని మోసపుచ్చి చారాయణుని తల యెత్తి రాకుండఁ జేసి మేఖల
భంగంబు నీఁగికొంద మిది రాజును భేదింప లేఁడు నమ్మెదుఁ జూడు మనిన
దేవి యది యట్టిద యని ముదితచిత్త యై కళావతిం గౌఁగలించుకొని. 171

పసదనం బిచ్చి బోటి యూపని యభేద్య
ముగ రచింపఁగ నెవ్వరిఁ బుత్త మనిన
సుగుణనిలయ కళావతి తగినవారిఁ
బనుపవలెఁ గాన మేఖలఁ బనుపు మనిన. 172

వ. దేవి యించుక విచారించి యి ట్లనియె. 173

క. మేఖల యిక్కార్యంబున, రేఖపడం బలుకపనికి సేరదు చెలియా!
నా ఖేదము చారాయణ, శాఖామృగమదము నీవ చని పుచ్చవలెన్. 174

వ. నాకు నీపని సేయు మని కరంబులు వట్టిన నది రాజునకు మందు సెప్పినవారి కథ యయ్యె నని వగచుచు నట్ల చేయుదు నని కదలి నృపతిసన్నిధికిం జని నయపూర్వకంబుగాం బొడసూపిన గారవించి సమీపంబున నుంచికొని. 175

క. భూవలయాధీశ్వరుఁడుం గ
ళావతి సంతోషజాతసలలితవచన
శ్రీవదనముచందముఁ గని
భావించుచు సఖుని కనియెం బ్రహ్లాదమునన్. 176

వ. కళావతి యపూర్వసంతోషవతి యై యున్నయది యీసంతసంబు మనకుం దేఁబోలు విన వలతు ననిన నది యి ట్లనియె. 177

క. సంతసములు కళ్యాణపు, సంతసముం గడవ లేవు జనుల కనిన భూ
కాంతుని పెండ్లికి మునలికి, సంతసములు కొఱంతయే విచారింపంగన్. 178

వ. అనుపలుకులు విని సందియంబుతో నించు కలరుచు మహీపాలుండు దాని కి ట్లనియె. 179

చ. మొగిళులలోని యేకతము ముచ్చిలి పుచ్చికొనంగఁ జాలు ద
సగిరికిం దామ్రపత్రికిని సంగమ మెన ఘటింప నేరు నిక
మిగిలిన యట్టిబుద్ధిమతి మేదిని నెందునుఁ గాన నేమి క్రొ
త గలుగఁ జూచి పెండిలిముదం బని యాడితి బోటి! చెప్పుమా. 180

వ. అనినం గళావతి భాగురాయణోపదేశంబునఁ దాను దేవిం బ్రబోధించినప్రకారంబు రాజును జారాయణుండును బ్రశంసించుచుకొనుచుండఁ దద్దయు సవిస్తరంబుగా వినిపించి యాపని ఘటింపం బూని తాన వచ్చుట యెఱింగించినం బరమానందంబున ధరణీకాంతుం డక్కాంతకు సత్యాదరంబునం గట్టు నిచ్చి దేవితోడ నీకుం దోఁచిన ట్లాడు మిటమీఁది కర్తవ్యంబును నీకు నెట్ల బుద్ధి యట్ల వర్తింపు మని వీడుకొల్పి భాగురాయణు బుద్ధివిశేషంబుఁ గొండొక కొనియాడి చారాయణుతోడ. 181

గీ. దేవి యిబ్బంగిఁ దా మోసపోవు నొక్క
కార్య మిదియును నడుమ విఘ్నంబు లేక

జరగు నొక్కొ లాటనృపకన్యచరిత మిచట
నౌరులు నెవ్వరు వింట లేకుండు నొక్కొ. - 182

వ. అనుచుండఁ జారాయణుండు దేవి నను బేలువెట్టుదు నను తమకంబున నెద్దియు నెఱుంగ దటు నూడు మిది యవశ్యంబు సిద్ధించు నని యూఱడించె నటఁ గళావతి వికసితానన యగుచు దేవికి మ్రొక్కె. 183

క. వనజానన! యొడఁబఱచితి, మనుజేంద్రుని నతని సఖుని మాయాజాలం
బునఁ గట్టితి మీఁదటిపని, యొనరింపు రహస్యభేద మొలయక యుండన్.

వ. అనుటయు సంతసిల్లి దానికి నభినవాంబరభూషణంబు లొసంగిన నది సని యవ్విధం బంతయు భాగురాయణునకు వినిపించి ప్రసాదంబు వడసి మృగాంకావళి కెఱిఁగించి మహానందంబునం దేలు నా రాజనందనచేత మెచ్చు కొనియె నిట దేవి యప్పుడ ముహూర్తకు రప్పించి యతనిచేత నద్దినంబునం బూర్వాహ్ణంబున నతివిశిష్టం బగు లగ్నంబు గలుగుట విని యప్రొద్ద వివాహం బని క్రమ్మఱఁ గళావతిచేతఁ జెప్పి పుచ్చి తదనుమతోత్తరంబున ముదం బంది పురంబు నగరు నలంకరింపవలసినపనులకుఁ దత్తదుచితకర్మకారులఁ బనిచి మృగాంకవర్మనకుం గాంతాలంకార మలవడం జేయు మని కళావతి నతిప్రయత్నంబున నియోగించి రాజుం గైసేయ నభినవప్రసాధనరచనానిపుణు లగు చతురుల కానతిచ్చిన నా ప్రొద్దు సర్వం బనుష్ఠితం బై లగ్నం బాసన్నం బగుటయు. 185

సీ. సల్లలితాశ్వత్థపల్లవమిశ్రితచారుపల్లవరత్నతోరణంబు
నసదృశకుంకుమరసలిప్తతలపరివళితముక్తారంగవల్లికంబు
ఫలపుష్పశుక్తిజప్రాలంబమాలికోదారవిచిత్రవితానకంబు
రమణీయమంగళద్రవ్యకాంచనపాత్రికాకారపుణ్యాంగనాకరంబు

గీ. విశదవేదఘోషాపూర్ణవిప్రగణము
దీప్తమణికాంతికల్పితదీపచయము
నగుచుఁ బరిణయమండప మమరి యుండ
రాజ్ఞి పనుపున రాజును రాజసుతయు. 186

ఉ. చూడ్కులు చూపఱన్ మొఱఁగి చొచ్చి కృతార్థతఁ జెందుచుండఁగా
వేడ్కలు నిక్కె నూఱటలు వేగము నల్లము సందియంబునన్
వీడ్కొలుపం బ్రమోదరసనీరధి దా నిరువేను లై నయ
మ్మోడ్కి వహించి చేసిరి సమంత్రకకృత్యములం గ్రమంబునన్. 187

వ. అనంతరంబు వేదిస్థలంబునకు వచ్చి హోమం బొనరించుచుండ దేవియు నాప్త
పరిచారికలును హాసోద్యోగు లగుసమయంబున భాగురాయణుండు సనుదెంచి
రత్నసుందరి సేయించునుపచారంబులు గైకొని యుచితస్థలంబున నాసీనుం డై
యాయమ నుద్దేశించి యి ట్లనియె. 188

గీ. చండవర్మమహారాజుసతి సుధామ
దేవి నీపేర లేఖ పుత్తెంచె ననుచు
నగరిమొగసాల నొకరుఁ డున్నాఁడు వానిఁ
బిలిచి తేరంగ నిప్పుడ వలయుఁ బనుప. 189

వ. అనుటయు దేవిచేత ననుజ్ఞాత యై యొక్కసతి చని తోడ్తెర వాఁడును దండ
ప్రణామం బాచరించి హారిద్రాముద్రం బైనతనచేతిలేఖ యిచ్చినం జదివించె
నది యె ట్లనిన. 190

సీ. స్వస్తి సమస్తసమేత సుధామమహాదేవి తన తనయకు
స్వస్తి సమస్తప్రశస్తిసమేత యై పరఁగినరత్నసుందరికిఁ బ్రీతిఁ
జెప్పు నీ కిపు డొక చిట్టితమ్ముఁడు గల్గె మున్ను నీపురమున నున్నయామ్ర
గాంకవర్మఁడు చెలియలు గాని నీకుఁ దమ్ముఁడు గాఁడు మగపేరు ప్రోయఁ జేసి

గీ. పెనిచితిమి మేము సుతుఁడు లేమినికిఁ దొల్లి
నిప్పు డక్కన్యఁ దగుపతి కిమ్ము నీవ
దానిఁ బొందినభూపతి ధరణి సార్వ
భౌముఁ డగు నిది మునివరభాషితంబు. 191

వ. అనులేఖ యాకర్ణించి. 192

క. తిచ్చవడి వెల్లవాఱుచు, ముచ్చముడిఁగి మూర్ఛ తన్ను ముంచికొనంగా
వచ్చినధైర్యం బూఁతగ, నచ్చేడియ నిల్చు టప్పు డద్భుత మయ్యెన్. 193

వ. అ ట్లుండి తనలోన. 194

క. ఇది యేమి చేసికొంటిని, మదిమది నుండి జను లెల్ల మతి లే దని న
వ్వెదరు సవతిరాకకు నై, మది నోర్చినఁ దలమె వారిమాటల కోర్వన్. 195

వ. అని యిట్లు పశ్చాత్తాపపీడిత యై యిది విధికృతం బింక దీనికి ధైర్యం బందమి
యే లని మెచ్చునకు ధైర్యంబు దెచ్చుకొని ధీర యగుట నవికార యై యుండె.

క. కార్యమూల మెఱుంగక కడఁగి యొరుల
కఱపు మది నమ్మి తమకు నయ్యెఱుక లేక

యొరలఁ బఱచెడు మని పోయి యొరలచేతఁ
దారు పడుదురు రత్నసుందరివిధమున. 197

వ. భాగురాయణుండు తనయుపాయంబు సఫలం బగుటకుఁ బ్రియం బందె. 198

క. పరముఖమునందుఁ బొందుగ, విరచించుచు మంతనంబు వెలిపుచ్చక నే
ర్పరి యైనభాగురాయణు, కరణి ననుష్ఠింప వలయుఁ గార్యము లెల్లన్. 199

వ. మృగాంకావళీకేయూరబాహు లనంతరంబున. 200

సీ. కర్పూరకస్తూరికాపరిమళకరండము లట్టిరత్నహర్మ్యములయందుఁ
గోకిలకీరాదికోలాహలంబున విలసిల్లునుద్యానతలములందు
మత్తకేకుల కెల్ల నృత్తరంగము లైనరమణీయకేళిశైలములయందుఁ
బరిమళకదళికాద్రాక్షాలతాశ్రేణి నమరుదీర్ఘికలతీరములయందు

గీ. నాఁడునాఁటికి వేడ్కలు నాటుకొనఁగ
సారెసారెకు నింపు లింపారుచుండ
నంతకంతకు నాదట లగ్గలింప
నంగజక్రీడఁ దేలుదు రభిమతముగ. 201

వ. ఇట్లు లబ్ధమనోరథుం డై కేయూరబాహుమహీనాథుండు. 202

సీ. తేజంబు గలఁడు సాధించు శత్రుల నాజ్ఞ
వెండి నిందకుఁ జాల వెఱచుఁ గాని
యరి నొవ్వఁ గొనఁడు త ప్పరయుధర్మరతుండు
భృత్యులం జెఱుపఁడు సత్యవాది
కలఁక యుబ్బుట భీతి కలుష మేమఱుట మొ
క్కలము వెఱఁగుపాటు చలము లేదు
కామినీలోలుండు గాఁడు సేవకు చేత
మఱవఁ డిచ్చినయీఁగి మగుడఁ గొనఁడు

గీ. క్రౌర్యలోభజాడ్యకపటవ్యసనముల
పొంతఁ బోవఁ డాయమును వ్యయంబు
తెలుఁగు నాఁడునాఁటి కింద్రియవశ్యుండు
గాక సుజనవినుతికలితుఁ డయ్యె. 203

సీ. తనయేలుభూమి యంతయుఁ దననగరిలోపలవోలె నెంతయుఁ దెలివి పడఁగ
నిచ్చట మరుదేశ మిచట జాంగలరాష్ట్ర మిచ్చట సమతల మిచట సార

మిట నసారము కొండ లిట నేరు నిచటఁ బేరడవి యిచ్చటఁ గల దని యెఱింగి
యీకాలమున కగు నిచట దుర్గం బని తెలిసి దుర్గంబులు బలుపు చేసి

గీ. బలిసి యున్న సమీపభూపతులలోన
సబలు నబలుని మిత్రుని శత్రు నరసి
చతురుపాయంబులను వారిఁ జక్కఁ జేసి
పుడమి పాలించి యెల్లెడఁ బొగడ నెగడె. 204

క. స్వామియు మంత్రియు దుర్గ
స్తోమము రాష్ట్రంబు వనము సుహృదులు బలముం
గా మహీ సప్తాంగము లని
తా మదిలో నెఱిఁగి వీనిఁ దగ రక్షించెన్. 205

సీ. స్త్రీలోలవృత్తిమై సింహబలుండును జూదంబుచే ధర్మసుతుఁడు నలుఁడు
స ... యాదవులును వేఁటతగులునఁ బాండుఁడు దశరథుండుఁ
... లును బరుసనిదండమున జరాసంధనృపతి
... గమున నాహరిశ్చంద్రమనుజపతియు

గీ. న ... యట్ల యగుట
వ్య ... ప్ప దని యెఱింగి
వాని ... ల్ల ... వాలి యేలి
సార్వభౌమత్వ మం ... జనవిభుండు. 206

గీ. బుద్ధి శస్త్రంబు సప్తాంగములును మేను
గార్యయత్నరహస్యరక్షణము జోడు
చారులే దృష్టులును నూతజనము ముఖము
ధర్మవర్తన ప్రాణ మా ధరణిపతికి. 207

వ. తద్రాజ్యంబున. 208

ఉ. వృత్తులఁ గల్మలం బొదలి విప్రులు పెద్దయు ధన్యులైరి య
త్యుత్తమధర్మకార్యముల నొంది వసుంధర సర్వదానసం
పత్తి వహించె ధర్మము లపారతఁ బొందె జనంబు గేహమున్
దత్తదభీష్టవస్తువులఁ దామరతంపర లయ్యె నయ్యెడన్. 209

## ఆశ్వాసాంత పద్యములు

శా. శాంతిదయాప్రియాభరణ కౌశికగోత్రగృహప్రదీప ది
గ్దంతిమదాంబుసేచనవిధానవివర్ధితకీర్తివల్లికా

క్రాంతసమస్తలోక యవిఖండితసంతతదానవర్ష వి
క్రాంత మనోహరార్థి జనచాతక భూతలపారిజాతకా ! 210

క. అభినవభానుతనూభవ
విభవపురందరలసద్వివేకబహుళ సౌ
రభ సంవాసితమానస
సుభగీజనమదన నిఖిలశుభగుణసదనా ! 211

మాలిని— గణకశిఖరరత్నా కావ్యవిద్యాప్రయత్నా
ప్రణుతజనశరణ్యా ప్రాజ్యలోకాగ్రగణ్యా
ఫణిశయదృఢభక్తా బంధువర్గానురక్తా
గుణిజనకృతసఖ్యా గుండనామాత్యముఖ్యా ! 212

గద్య— ఇది సకలసుజనవిధేయ మంచననామధేయప్రణీత [illegible] బాహు
చరిత్రంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

## శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 16 | 18 | వలని మానని | వలన నూనిన |
| 54 | 11 | కిం గర్జిత | నిర్గర్జిత |
| 55 | 1 | తావాసితక [illegible] | |

## సారస్వత కుటీరము

### ప్రచురణలు

| | రు. | న.పై. |
|---|---|---|
| అన్నమార్యోదాహరణము | 0 | 50 |
| స్వప్నవాసవదత్తము [భాసకృతికి తెనుగు] | 1 | 75 |
| పాలవెల్లి [సాహిత్యవ్యాససంపుటి] | 1 | 50 |
| కవిరాజశిఖామణి | 2 | 50 |
| కళాపూర్ణోదయప్రశంస | 1 | 00 |
| కేయూరబాహుచరిత్రము – మంచనకవి ప్రణీతము [పరిష్కృతముద్రణము] | 1 | 75 |



అచ్చులో నున్నవి

నన్నిచోడని కుమారసంభవము

[సవ్యాఖ్యానము]

తెలుఁగువెలుఁగులు

[సాహిత్యవ్యాసములు]